# పరాక్రి తెలుగు వ్యాకరణం



హైస్కూలు విద్యార్థుల కొరకు

FOR HIGH SCHOOL STUDENTS

PARAKRI

# TELUGU GRAMMAR




సంకలనం : పంతుల వెంకట రాధాకృష్ణ

సెల్ ; 9966455872 - parakrijaya@gmail.com

# తెలుగు

## పేపర్ – I - 40 మార్కులు

## అవగాహన – ప్రతిస్పందన - 12 మార్కులు

**I. క్రింది పద్యాలలో ఒక దానికి ప్రతిపదార్థం రాయండి.** - 4 మార్కులు

1. శివరాజంతట మేల్కొసుంగు దెరలో ......................................
2. అనుచున్ జేవురు మీరు కనుగవతో .....................................
3. వడిగొని రేకులుప్పతిల ..................................................
4. సురుచిర తారకా కుసుమశోభి ...........................................
5. ఆ కంఠంబుగ నిప్డు మాధుకర ...........................................
6. అనవుడు నల్ల నవ్వి కమలాలలన ................ యభీప్సితాన్నముల్
7. నీరము తప్తలోహమున ............................. గొల్చు వారికిన్
8. ఉరుగుణవంతుడొడ్లు ................................. తాలిమి నీయదె వెన్న భాస్కరా ?
9. చిక్కని పాలపై ..................................... దాశరథీ కరుణాపయోనిధీ
10. తన చూపంబుధి మీద .............................. గుప్పించి లంఘించుచోన్

**II. ఈ క్రింది వానిలో ఒక పద్యాన్ని పూరించి , భావం రాయండి.** - 4 మార్కులు

1. సురుచిర తారకా ------
2. ఆ కంఠంబుగ నిప్డు మాధుకర -----
3. దెసలను కొమ్మ లొయ్యనతి దీర్ఘములైన -----
4. తన దేశంబు స్వభాష -----
5. మా సర్దారుడు తొందరన్ -------
6. పట్టుగనీశ్వరుండు ---------
7. అనల జ్యోతుల -------
8. శివరాజంతట మేల్కొసుంగు ------
9. తన చూపంబుధి మీద ------ గుప్పించి లంఘించుచోన్
10. నీరము తప్త లోహమున ------ గొల్చువారికిన
11. చిక్కని పాలపై -------- దాశరథీ కరుణాపయోనిధీ.

**III.** కింది గద్యాన్ని చదవండి 4 ప్రశ్నలు తయారు చేయండి 4 మార్కులు

# II స్వీయ రచన - 18 మార్కులు

**(అ) కింది ప్రశ్నలకు నాలుగైదు వాక్యాల్లో సమాధానాలు రాయండి.** 4 X 2 = 8 మార్కులు

1. కవి వెన్నెలను వర్ణించడానికి ఏయే అంశాలను ఎన్నుకున్నాడో రాయండి.

2. పరవస్తు చిన్నయ సూరి గురించిన విషయాలను వివరించండి.

3.'మాణిక్య వీణ' పాఠ్యాంశ నేపథ్యాన్ని గురించి రాయండి.

4.'విద్వాన్ విశ్వం' కవి గురించి రాయండి.

5. 'పీఠిక ' ప్రక్రియను గురించి వివరించండి.

6. శివాజీ ఆదర్శం లోని గొప్పతనాన్ని సొంత వాక్యాల్లో వ్రాయండి.

7. మానవులు పావురాలకు మిత్రులూ, సహచరులని రచయిత ఎందుకు అన్నాడు?

8. సంధ్య కాలపు కొత్త కాంతి ఎలా ఉందని కవి చెప్పాడు?

9. 'వెన్నెల' పాఠ్యభాగ రచయితను గురించి వ్రాయుము.

10."వివేక హీనుడైన ప్రభువును సేవించుట కంటె వనవాసముత్తమము" - దీని ఔచిత్యాన్ని వివరించండి.

11. భారతధేశ బాగ్య కల్పలతలని శివాజి ఎవరిని , ఎలా కీర్తించాడు.

12. "కాలం చాలా విలువైంది" ఎందుకు?

13. అమరావతిలోని శిల్పాలు గొప్పతనమేమిటి?

14. శతక ప్రక్రియ గురించి రాయండి?

15. మంథరుని మాటలు మీరు సమర్తిస్తారా? ఎందుకు?

16. అందరూ నగరాల్లో జీవించాలని ఎందుకు అనుకుంటున్నారు?

17. కష్టం ఒకరిది ఫలితం మరొకరిది అనడంలో కవి ఉద్దేశం ఏమిటి?

18. ఆచార్య నాగార్జునుని స్వభావాన్ని విశ్లేషించండి?

19. సజ్జన లక్షణాలు పేర్కొనండి?

18. " ఒంటరిగా ఉన్నప్పుడు పుస్తకాలే మన నేస్తాలు " - అనే వాక్యంతో మీరు ఏకీభవిస్తారా? ఎందుకు?

19. చిత్ర గీవం తండ్రి పక్షిని గురించి వ్రాయండి.

**(ఆ) ఈ క్రింది ప్రశ్నలకు 10 లేక 12 వాక్యాల్లో సమాధానం వ్రాయండి.** **2 X 5 =10 మార్కులు**

1. వెన్నెల్లో మీ అనుభూతిని తెల్పండి.
2. "మాణిక్య వీణ " పాఠాంశమును మీ సొంత మాటల్లో రాయండి.
3. పల్లె జీవన విధానాన్ని పట్నంతో పోలుస్తూ సమాధానం రాయండి.
4. శివాజి వ్యక్తిత్వంలోని విశేషాలను , స్త్రీల పట్ల అతను చూపిన ఔదార్యాన్ని విశ్లేషింవండి.
5. "పల్లెటూళ్ళు ప్రశాంత జీవిత సౌఖ్యానికి పుట్టిళ్ళు" దీన్ని సమర్థిస్తూ సమాధానం రాయండి.
6. శిశువుల పెంపకంలో పక్షులకూ, మానవులకూ మధ్య ఉన్న పోలికలను భేధాలను తెల్పండి.
7. వెన్నెల పాఠం పద్య భావాలను ఆధారంగా చేసుకొని పాఠ్యభాగ సారాంశాన్ని రాయండి.
8. "వివేకహీనుడైన ప్రభువును సేవించుట కంటె వనవాసముత్తమము " - దీని ఔచిత్యాన్ని గురించి చర్చించండి.
9. స్త్రీ రత్నములు పూజ్యులు అన్న శివాజి మాటలను మీ సొంత అనుభవాల ఆధారంగా సమర్థించండి.
10. "మాతృభావన" పాఠం ఆధారంగా శివాజీ వ్యక్తిత్వాన్ని తెల్పండి.
11. "భిక్ష" పాఠం ఆధారంగా శ్రీనాధుని రచనా శైలి సొంతమాటల్లో రాయండి.
12. "గోరంత దీపాలు" (కథానిక) లోని వృద్ధుని పాత్ర స్వభావాన్ని , గొప్పధనాన్ని సొంత మటల్లో రాయండి.
13. "భిక్ష" పాఠం లోని కథను సంక్షిప్తంగా రాయండి.
14. కోపం కారణంగా వ్యాసుడు కాశీ నగరాన్నే శపించాలనుకున్నాడు కదా! కోపం మనిషి విచక్షణను నశింపజేస్తుంది అనే అంశం గురించి రాయండి.
15. అమరావతి సాంస్కృతిక వైభవాన్ని వివరించండి.
16. హనుమంతుడు సముద్రాన్నిలంఘించిన విధానాన్ని అని ఎలా వర్ణించాడు.

## PART – B - 10 మార్కులు

## III భాషాంశాలు

| భాషాంశాలు | మార్కులు | భాషాంశాలు | మార్కులు |
|---|---|---|---|
| 1. అర్థాలు | 1 | 2. నానార్థాలు - | 1 |
| 3. పర్యాయపదాలు - | 1 | 4. వ్యుత్పత్యార్థాలు | 1 |
| 5. సంధులు - | 1 | 6. సమాసాలు - | 2 |
| 7. ప్రకృతి - వికృతులు | 1 | 8. చంధస్సు | 1 |
| 9. అలంకారాలు - | 1 | | |

# అర్థాలు

ఉదా:- భరతమాత మందస్మిత కాంతి అందరినీ ఆకట్టుకున్నది.

స్మితకాంతి = నవ్వులకాంతి

| | |
|---|---|
| 1. దివి = స్వర్గం , ఆకాశం | 26. అహిమకరుడు = సూర్యుడు |
| 2. మిక్కుటం = అధికం | 27. ఆకలింపు = అవగాహన, తెలుసుకోవడం |
| 3. రజనీ కరబింబం = చంద్రబింబం | 28. కాణాచి = ఆటపట్టు, చిరవాస్థానం |
| 4. అంగలార్చు = దు:ఖించు | 29. భాగీరథీ = గంగ |
| 5. భృంగం = తుమ్మెద | 30. అహరహం = ప్రతిరోజు |
| 6. ఇనుడు = సూర్యుడు | 31. సంయమి = ముని |
| 7. తాలిమి = ఓర్పు | 32. కళవళం = కలత |
| 8. క్షుత్తు = ఆకలి | 33. చమూధవుడు = సేనాధిపతి |
| 9. ఏకాకి = ఒంటరివాడు | 34. సౌజన్యం = మంచితనం |
| 10.గోమయము = ఆవుపేడ | 35. లోభము = పిసినారితనము , ఆశ |
| 11. ముక్తాఫలం = ముత్యము | 36. లలామ = శ్రేష్ఠురాలు |
| 12. కర్కోటకుడు = కఠినుడు | 37. నిమిత్తం = కారణం |
| 13.ఝరి = ప్రవాహం | 38. ముష్టింపంచులు = దరిద్రులు |
| 14. భ్రుకుటి = కనుబొమ | 39. సేవనం = అభిషేకం |
| 15.కుత్తుక = కంఠం | 40. సౌదామిని = మెరుపు |
| 16. పరివ్రాజకుడు = సన్యాసి | 41. పురంధ్రి = ఇల్లాలు, స్త్రీ |
| 17. నిదాఘం = వేసవి, ఎండాకాలం | 42. ఆనతి = ఆజ్ఞ, నమస్కారం |
| 18. భల్లూకం = ఎలుగుబంటు | 43. ఆఘాతం = దెబ్బ |
| 19. ఉపద్రవం = ఆపద, విపత్తు | 44. మకుటం = కిరీటం |
| 20. అగ్గలించు = అధికమవుట | 45. పారాశర్యుడు = వ్యాసుడు |
| 21. గ్రీవం = కంఠం , మెడ | 46. ఛాత్రుడు = శిష్యుడు |
| 22. తంత్రం = ఉపాయం | 47. హటకపీఠం = బంగారు పీఠం |
| 23. తదేకం = అదేపనిగా | 48. కుముదిని = తెల్లకలువ |
| 24. మ్రుక్కడి = మూర్ఖుడు | 49. కులిశం = వజ్రాయుధం |
| 25. మైత్రి = స్నేహం | 50. అంకురించు = మొలకెత్తు , పుట్టు |

51. అఖిలం = అశేషం,అంతం , సమస్తమైన
52. అన్నృతం = అసత్యం
53. అపభ్రంశం = అపశబ్దం
54. అభిఘురించు = చల్లు, చిలకరించు
55. అర్ఘ్యపాద్యములు = కాళ్ళు, చేతులు కడుకోవడానికి ఇచ్చే నీల్లు
56. అవిరళం = విరళం కానిది, దట్టమైన
57. ఆప్యాయత = ఆదరణ, ఇష్టం
58. ఇందు బింబాస్య = చంద్రబింబం వంటి ముఖము కలది
59. ఈప్సితం = కోరిక
60. ఉద్యమం = ప్రయత్నం
61. ఉపస్పర్శ = స్నాన, ఆచమనాదికాలు
62. ఎలమి = వికాసం, సంతోషం
63. ఎఱకలు = రెక్కలు
64. ఏమరుపాటు = అజాగ్రత్త
65. ఓష్ఠం = పెదవి
66. కన్నుగవ = కన్నుల జంట
67. కబళం = ముద్ద
68. కరవటంబు = భరణి , గిన్నె
69. కలభాష = మధుర భాష
70. కుందాడు = బాధపెట్టినట్లు మాట్లాడటం
71. కుంభి = ఏనుగు
73. కొండాడు = పొగడు, స్తుతించు
74. ఖులుడు = దుర్మార్గుడు, దుష్టుడు , దుర్జనుడు
75. ఖేదం = శోకం
76. కురిడీ = కొబ్బరి కాయలో ఎండిన కొబ్బరి
77. చట్టువం = గరిటె
78. చిరంతనుడు = శాశ్వతుడు
79. జేవురు = ఎర్రనిది, ఎరువు
80. జోటి = దుప్పటి
81. జోక = ఉత్సాహం , యుక్తం
82. తర్కం = ఊహ , కారణం , కోరిక, ఒక శాస్త్రం
83. తారక = చుక్క
84. తేట = నిర్మలం, ప్రసన్నం , విశదం
85. దివసం = పగలు, రోజు
86. దివసేంద్రుడు = సూర్యుడు
87 దీధితి = కిరణం, వెలుగు, కాంతి
88 ద్వాఃకవాటం = ద్వారబంధం , తలుపు
89 నిష్ణాతుడు = నేర్పరి
90 పుయిలోడు = జంకు, సంకోచించు,భయపడు, వెనుదీయు
91 . పూరం = జల ప్రవాహం
92. బుధులు = పండితులు , విద్వాంసులు
93. బుద్బుదం = నీటి బుడగ
94. బృహత్తర = గొప్పదైన
95. బీరు +ఎండ = అధికమైన ఎండ
96. మంద్రం = గంభీర ధ్వని
97. మచ్చకంటి = చేపల వంటి కన్నులు గల స్త్రీ
98. మదీయ = నా యొక్క
99. మీలనము = కళ్ళు మూయుట
100. ముప్పిరిగొను = బలపడటం
( మూడు తాళ్ళు పెనవేసుకున్నట్లు )
101. యాతన = బాధ , కష్టం , తీవ్ర వేదన
102. రజని = రాత్రి
103. రుచిరం = కాంతి
104. రోదసి = ఆకాశం , భూమి , భూమ్యాకాశాలు
105. లాతి = అన్యుడు
106. లోచనం = కన్ను
107. వాటిక = వీధి
108. వార్తాహరి = వృత్తాంతం తెలిసికొనిపోయి చెప్పేది
109. వెఱపు = భయం
110. వేదోక్తం = వేదంలో చెప్పిన

| | |
|---|---|
| 111. వ్యోమం = ఆకాశం | 142. కోల = కర్ర |
| 112. షండం = సమూహం | 143. కేసరం = సింహం |
| 113. సంచయం = సమూహం, కూడిక | 144. ధరాధరం = పర్వతం |
| 114. సంత్రాసం = మిక్కిలి భయం | 145. ఉల్లము = మనసు |
| 115. సంక్షిప్తం = కుదించినది | 146. రయము = వేగం |
| 116. సాధ్వి = పతివ్రతి , శీలవతి | 147. వాసము = ఇల్లు |
| 117. సాన్నిధ్యం = సమీపం , దగ్గర, సన్నిధి | 148. వ్యాసంగం = కృషి |
| 118. సుధాకరుడు = చంద్రుడు | 149. విప్రులు = బ్రాహ్మణులు |
| 119. స్నిగ్ధం = స్నేహం గలది , నునుపు గలది | 150. వీడు = పట్టణం |
| 120. హంగులు = డాబు, దర్పం , అట్టహాసం | 151. ఆరామం = తోట |
| 121. హోరు = తీవ్ర ధ్వని అనుకరణ ( గాలి వీచడం, వాన కురువడం) | 152. కాణాచి = చిరకాల వాస స్థానం |
| 122. క్షుత్పిపాసలు = ఆకలి దప్పులు | 153. ప్రాకారం = ప్రహరి గోడ |
| 123. సంజ వెలుగు = సంధ్యా సమయంలో వెలువడే కాంతి | 154. వితరణ = దానం |
| 124. ఆశీర్వాదం = దీవెన | 155. చిరాయువు = దీర్ఘమైన ఆయుర్దాయము కలది |
| 125. తదేకంగా = అదే పనిగా | 156. అజరామరం = శాశ్వతమైనది |
| 126. కాలక్షేపం = కాలం వెళ్ళ బుచ్చడం | 157. పరమావధి = ముఖ్యమైనది |
| 127. ఘులుము = రాచు | 158. ఆలవాలం = స్థానం |
| 128. తిరియుట = అడుగుట | 159. సంప్రోక్షణ = పరిశుద్ధి చేయడం |
| 129. రుగ్మత = జబ్బు | 160. యవనిక = తెర |
| 130. గీటురాయి = నిదర్శనం, ప్రమాణం | 161. ఆకాశ హర్మ్యాలు = ఎత్తైన మేడలు |
| 131. ఆయత్తం = సిద్ధం | 162. హంగు = డాబు, దర్పం, అట్టహాసం |
| 132. సిరి = సంపద | 163. భాసిల్లు = ప్రకాశించు |
| 133. వనిత = స్త్రీ | 164. చర్మకారుడు = చెప్పులు కుట్టువాడు |
| 134. కైరవ షండము = కలువల సమూహం | 165. అమరావతి = మరణం లేనిది |
| 135. సరిత్తు = నది | 166. నళినీ దళం = తామరాకు |
| 136. స్ఫూర్తి = స్ఫురణ, ప్రోత్సాహం | 167. శుక్తి = ముత్యపు చిప్ప |
| 137. అక్షతలు = మంగళకరమైన అక్షతలు | 168. బిసతంతు = తామర తూడులోని దారం |
| 138. వైభవం = గొప్పతనం | 169. విమల = స్వచ్ఛమైనది |
| 139. విరాజిల్లు = మిక్కిలి ప్రకాశించుట | 170. ద్రవ్యం = ధనం |
| 140. ఉపలములు = రాళ్ళు | 171. దలవాయి = సైన్యాధిపతి |
| 141. కూట కోటులు = పర్వత శిఖరాలు | 172. ముష్కరుడు = దుష్టుడు, నీచుడు |

| | | |
|---|---|---|
| 173. లాలన | = | లాలించు,బుజ్జగించు |
| 174. ఘనత | = | గొప్పతనం |
| 175. మర్మము | = | రహస్యం |
| 176. నీరము | = | నీరు |
| 177. అకుంఠిత | = | అడ్డులేని |
| 178. మేచక | = | నల్లని |
| 179. మృషల్ | = | అపద్దాలు |
| 180. పారావారం | = | సముద్రం |
| 181. అంబుధి | = | సముద్రం |
| 182. నభోవీధి | = | ఆకాశం లోకి |
| 183. కార్ముకం | = | ధనస్సు |
| 184. శరం | = | బాణం |
| 185. ప్రభంజనం | = | పెనుగాలి |
| 186. ప్రాభవం | = | శ్రేష్టత్వం, గొప్పతనం |
| 187. తథాగతుడు | = | బుద్ధుడు |
| 188. భరిణ | = | చిన్నపెట్టే |
| 189. అలరారు | = | శోభిల్లు |
| 190. కరువలి పేలుపు | = | గాలి దేవుడు |
| 191. వివరం | = | రంధ్రం |
| 192. సేతువు | = | వారధి, వంతెన |
| 193. వలువలు | = | వస్త్రాలు |
| 194. ఉదధి | = | సముద్రం |
| 195. అంఘ్రులు | = | పాదాలు |
| 196 అమరులు | = | దేవతలు |
| 197. ఏటి జోటి | = | నదీ కాంత |
| 198. లంఘించుట | = | దూకుట |

# నానార్థాలు

| | | |
|---|---|---|
| 1) వెల్లి | - | ప్రవాహం, పరంపర, తెలుపు |
| 1) కుండలి | - | పాము, నెమలి, కుబేరుడు, వరుణ దేవుడు |
| 2) నిట్ట వొడుచు | - | ఉప్పొంగు, విజృంభించు, రోమాంచితమగు |
| 3) కరము | - | చేయి, తొండం, కిరణం |
| 4) కదురు | - | అతిశయించు, కలుగు, విజృంభించు, నూలు వడికెడు సాదనము |
| 5) అర్థి | - | యాచకుడు, ధనవంతుడు, సేవకుడు, వాది, వేడేవాడు |
| 6) మిత్రుడు | - | సూర్యుడు, స్నేహితుడు |
| 7) వనం | - | తోట, నీరు, గుంపు, అడవి |
| 8) వాసం | - | ఇల్లు, వెదురు, బట్ట, కాపురం, వస్త్రం |
| 9) ప్రాణము | - | జీవుడు, గాలి, చైతన్యం |
| 10)పుణ్యము | - | సుకృతం, ఆకాశం, నీరు, పూవు |
| 11)ఛాయ | - | నీడ, పార్వతి, పోలిక |
| 12)గృహము | - | ఇల్లు, భార్య, పేరు |
| 13)గురువు | - | ఉపాధ్యాయుడు, తండ్రి, పురోహితుడు |
| 14)కులము | - | వంశము, జాతి, ఇల్లు |
| 15)గుణము | - | స్వభావము, దారము, అల్లెత్రాడు |
| 16)గంగ | - | భాగీరథి, నది, నీరు |
| 17)బుధుడు | - | పండితుడు, దేవత, బుధ గ్రహం |
| 18)వాహిని | - | నది, సేన |
| 19) వీడు | - | మనుష్యుడు, పట్టణము, వదలుట |
| 20) లెస్స | - | మేలు, చక్కన, మంచిది, శ్రేష్ఠం, యుక్తం |
| 21) గురుడు | - | ఉపాధ్యాయుడు, తండ్రి, బలీయం, బృహస్పతి |
| 22) కాయ | - | చెట్టుకాయ, బిడ్డ, అరచేతిలో రాపిడి వల్ల ఏర్పడిన పొక్కు |
| 23) ముఖము | - | మోము, ఉపాయం, ముఖ్యమైనది |
| 24) ఫలము | - | పండు, ప్రయోజనం, లాభం, సుఖం |
| 25) వీధి | - | త్రోవ, వాడ, నాటక భేదము |
| 26) లక్ష్మి | - | రమ, సిరి, మెట్టదామర |
| 27) కాలం | - | సమయం, నలుపు, చావు |
| 28) అనృతం | - | అసత్యం, సేద్యం, వాణిజ్యం |
| 29) కంకణం | - | తోరం, నీటి బిందువు, స్త్రీలు చేతికి ధరించే ఆభరణం |
| 30) కళ | - | చదువు, అవ్యక్త మధుర ద్వని, శిల్పం, చంద్రునిలో పదహారవ వంతు |

| | | |
|---|---|---|
| 31) గడ | - | స్తంభం, సమూహం, పొడుగాటి, పెదురు కట్టె |
| 32) గుడి | - | దేవాలయం, గుండ్రని గీత, డేరా, గుణింతంలో గుడి |
| 33) గ్రహణం | - | బుద్ధి, నేత్రం, ఆవరించు |
| 34) ఘూర్ణిల్లు | - | మ్రోగు, తిరుగుడుబడు |
| 35) ఘోష | - | ఉరుము, ఆవులమంద, కంచు |
| 36) తుచ్ఛం | - | దుఃఖం, శూన్యం |
| 37) ముద్ర | - | గుర్తు, అచ్చు వేయడం |
| 38) భాగ్యం | - | అదృష్టం, సంపద |
| 39) మల్లె చెట్టు | - | ముకురము, అద్దము |
| 40) సూత్రం | - | వ్యాకరణ సూత్రం,దారం |
| 41) అవధి | - | హద్దు, కాలం, ఏకాగ్రత, |
| 42) ఇంద్రుడు | - | దేవేంద్రుడు, శ్రేష్ఠుడు, ప్రభువు, ఈశ్వరుడు |
| 43) కవి | - | కావ్యకర్త, శుక్రుడు, వాల్మీకి, ఋషి, నీటి కాకి |
| 44) కరి | - | ఏనుగు, కోతి, ఎనిమిది, సాక్షి |
| 45) దళము | - | ఆకు, సేన, సగము, గుంపు |
| 46) సుధ | - | అమృతం, సున్నం, ఇటుక, చెముడు మొక్క |
| 47) లక్ష్మి | - | శ్రీదేవి, కలువ, పసుపు, ముత్యము, జమ్మిచెట్టు |
| 48) శ్రీ | - | లక్ష్మి, ఐశ్వర్యం, అలంకారం, విషము, సాలె పురుగు, ఒక రాగం |
| 49) యుగము | - | జంట, రెండు, బండి కాడి, వయస్సు |
| 50) ద్రవ్యం | - | ధనం, ఇత్తడి, ఔషధం, లక్క |
| 51) శరము | - | బాణము, నీరు, రెల్లు |
| 52) పురము | - | పట్టణము, ఇల్లు, శరీరం, మరణం |
| 53) రసము | - | పాదరసము, శృంగరాది రసములు, విషం, బంగారం |
| 54) బలి | - | ఒక చక్రవర్తి, గంధకము, కప్పము |
| 55) వీధి | - | త్రోవ, వాడ, పంక్తి |
| 56) వీడు | - | మనుష్యుడు, పట్టణము, వదలుట |
| 57) లెస్స | - | మేలు, చక్కన, మంచిది, శ్రేష్టం, యుక్తం |
| 58) గురుడు | - | ఉపాధ్యాయుడు, తండ్రి, బలీయం, బృహస్పతి |

# పర్యాయ పదాలు

| | | |
|---|---|---|
| 1) చాడ్పు | - | పోలిక, రీతి, విధము, భంగి, పగిది |
| 2) వెల్లి | - | ప్రవాహం, ధార, వేగము, పూరము, స్రోతస్సు |
| 3) కైరవం | - | తెల్ల కలువ, ఉత్పలము, కువలయము, కుముదము, కైరవిణి |
| 4) కౌముది | - | వెన్నెల, చంద్రిక, జ్యోత్స్న, చాంద్రి |
| 5) చంద్రుడు | - | చందమామ, జాబిల్లి, నిశాపతి, సోముడు, ఇంద్రుడు, సుధకరుడు, రజనీకరుడు |
| 6) తపస్సు/తమం | - | చీకటి, అంధకారం, తిమిరం, ఇరులు, గహ్వరం |
| 7) తోయధి | - | అంభోధి, పయోనిధి, సముద్రం, సాగరం, కడలి, జలధి |
| 8) లలన | - | సతి, స్త్రీ, ఇంతి |
| 9) లోచనము | - | కన్ను, నేత్రం, నయనం |
| 10) కాంత | - | స్త్రీ, మహిళ, ముదిత, పడతి, అతివ |
| 11) రైతు | - | కృషీ వలుడు, కర్షకుడు,హాలకుడు, వ్యవసాయదారుడు |
| 12) వాంఛ | - | అభిలాష, కోరిక, కాంక్ష, ఇచ్ఛ, తృష్ణ, ఈప్సితం |
| 13) నభము | - | ఆకాశము, నింగి, మిన్ను, గగనము, అంబరము |
| 14) రుగ్మత | - | రోగము, జబ్బు, అస్వస్థత, వ్యాధి |
| 15) నరుడు | - | మానవుడు, మనిషి, మర్త్యుడు |
| 16) పసిడి | - | భృంగారము, బంగారం, పుత్తడి, కాంచనం, కనకం, హేమము |
| 17) ఎలుక | - | మూషికం, ఖనకం, ఎలిక |
| 18) గృహం | - | ఇల్లు, గేయం, నికేతనం |
| 19) రాత్రి | - | నిశ, రజని, యామిని |
| 20) ధనము | - | అర్థం, ద్రవ్యం, విత్తము, డబ్బు, పైసలు |
| 21) సమూహం | - | గుంపు, బృందం, నిదహం |
| 22) నికేతనం | - | ఇల్లు, గృహం, వాసం |
| 23) పరివ్రాజకుడు | - | సన్యాసి, భిక్షువు, బోడ, యతి |
| 24) బుద్ధి | - | ప్రజ్ఞ, మతి, మేధ, ప్రజ్ఞానం |
| 25) ఆజ్ఞ | - | ఆదేశము, ఆన, ఉత్తరువు, నిర్దేశము |
| 26) కన్ను | - | అక్షి,చక్షువు, నేత్రము, నయనము |
| 27) అనలం | - | అగ్గి,నిప్పు, దహ్ని, జ్వలనము |
| 28) కాంత | - | మగువ, కొమ్మ, ఇంతి, పడతి |
| 29) గంగ | - | భాగీరథి, జాహ్నవి |
| 30) శివుడు | - | రుద్రుడు, ముక్కంటి, ఈశ్వరుడు, శంకరుడు, పినాకపాణి |
| 31) మైత్రి | - | స్నేహం, సాంగత్యం |

32) కాంత - స్త్రీ,నారి, వనిత, మహిళ

33) గుడి - దేవాలయం, కోవెల, దేవళము

34) భల్లూకము - ఎలుగు, భల్లము, ఎలుగు గొడ్డు

35) ఇల్లాలు - భార్య, అర్థాంగి, పత్ని

36) గ్రంధము - పుస్తకం ,కావ్యం, పొత్తం

37) జగత్తు - లోకం, జగం, భువనం

38) రక్తము - నెత్తురు, శోణితం ,కోలాలం

39) నమ్మకం - విశ్వాసం, ప్రత్యయం

40) పల్లె - గ్రామం, జనపదం

41) అరణ్యం - విపినం, అడవి,వనం

42) పువ్వు - కుసుమం, పుష్పం

43) మరణం - చావు, మృత్యువు

44) వాంఛ - కోరిక, అభిలాష

45) వృక్షం - చెట్టు, తరువు, భూరుహం

46) అన్నం - భోజనం, ఆహారం, కూడు

47) భోజనం - భుక్తి, కూడు, తిండి

48) నిక్కము - నిజం, వాస్తవం

49) వితతి - గుంపు, సమూహం, బృందం, నివహం

50) కార్ముకము - విల్లు, ధనుస్సు, సింగిణి, శరాసరం

51) సుత - కూతురు, పుత్రిక, కుమారి, తనయ

52) జలం - నీరు, ఉదకం, వారి, పానీయం

53) పద్ధతి - విధము, రీతి, తీరు

54) స్మరణ - జ్ఞప్తి, స్మృతి, తలపు

55) మిన్ను - ఆకాశం, నింగి, గగనం, నభం

56) తాండవం - నృత్యం, నాట్యం, నర్తనం, లాస్యం

57) తేరు - రథము, అరదము, స్యందనము, శతాంగము

58) జ్ఞానం - విజ్ఞానం, ఎఱుక, తెలివి

59) మాట - పలుకు, వచనము, ఉక్తి

60) అడుగు - పాదం, చరణం, పదం

61) గుర్రాలు - అశ్వములు, హయములు, తురంగములు

62) ముత్యము - మౌక్తికము, ముక్తా ఫలము, ఆణి

63) కన్నీరు - అశ్రువు, బాష్పము, అస్రము

| | | |
|---|---|---|
| 64) ఓర్పు | - | సహనము, క్షాంతి, తాలిజ |
| 65) ద్వాఃకవాటము | - | ద్వారబంధము, ద్వారం తలుపు |
| 66) పసిడి | - | బంగారము, సువర్ణము, కనకము, హిరణ్యము, పైడి |
| 67) పారాశర్యుండు | - | వ్యాసుడు, బాదరాయణుడు, సాత్యవతేయుడు |
| 68) ఆగ్రహము | - | కోపము, క్రోధము, రోషము, కినుక |
| 69) గంధము | - | చందనము, మలయజము, గంధసారము |
| 70) నెయ్యి | - | ఆజ్యము, ఘృతము, నేయి |
| 71) గొడుగు | - | ఛత్రము, ఆతపత్రము, ఖర్పరము |
| 72) ముఖము | - | వదనము, ఆననము, మొగము |
| 73) బ్రాహ్మణుడు | - | భూసురుడు, విప్రుడు, ద్విజుడు |
| 74) అనృతం | - | అసత్యం, అబద్ధం, బొంకు |
| 75) అమరులు | - | దేవతలు, నిర్జరులు, సురలు, గీర్వాణులు, త్రిదశులు, వేల్పులు |
| 76) అహిమకరుడు | - | సూర్యుడు, భానుడు, రవి, భాస్కరుడు |
| 77) ఆస్యం | - | ముఖం, ఆననం, మోము |
| 78) కప్ప | - | భేకం, దర్దురం, మండూకం |
| 79) కౌముది | - | వెన్నెల, చంద్రిక, జ్యోత్స్న |
| 80) చాడ్పు | - | విధం, భంగి, రీతి, తీరు |
| 81) మౌళి | - | సిగ, శిఖ, కొప్పు |
| 82) వివరం | - | రంధ్రం, బలం, కలుగు |
| 83) వస్త్రం | - | వలువ, పుట్టము, చేలం, గుడ్డ, వసనము, పటము |
| 84) నది | - | వాహిని, తరంగిణి, స్రవంతి |
| 85) రుద్రుడు | - | శంకరుడు, భవుడు |
| 86) దేహం | - | శరీరం, కాయం |
| 87) లక్ష్మి | - | పద్మ, కమల, రమ, లచ్చి |
| 88) కరి | - | ఏనుగు, హస్తి, సామజము, ఇభము, దన్తి, మత్తేభము |
| 89) కాకి | - | వాయసము, చిరజీవి, అరిష్టము |
| 90) కలువ | - | కాటకము, క్షామము |
| 91) తోక | - | వాలము, లాంగూలము, పుచ్ఛము |

# వ్యుత్పత్యార్థాలు

| | | | |
|---|---|---|---|
| 1) రజనీకరుడు | - | రాత్రిని కలుగచేసేవాడు | (చంద్రుడు) |
| 2) వనజాతము | - | నీటి నుండి పుట్టునది | ( పద్మం ) |
| 3) పన్నగము | - | పాదములచే పోవునది | ( పాము ) |
| 4) రజనీశ్వరుడు | - | రాత్రులకు ప్రభువు | ( చంద్రుడు ) |
| 5) సుధాకరుడు | - | అమృత మయములైన కిరణాలు కలవాడు | (చంద్రుడు ) |
| 6) పుత్రుడు | - | పున్నామ నరకం నుండి రక్షించువాడు | ( కుమారుడు ) |
| 7) దేహి | - | దేహాన్ని ధరించినవాడు | ( మనిషి ) |
| 8) ఈశ్వరుడు | - | ఐశ్వర్యము ఉన్నవాడు | ( శివుడు ) |
| 9) గురువు | - | అజ్ఞానమనెడి అంధకారమును పోగొట్టువాడు | ( ఉపాధ్యాయుడు ) |
| 10) సన్యాసి | - | సర్వమూ (న్యాసం చేసినవాడు) వదిలివేసినవాడు | (సన్యాసి) |
| 11) ముని | - | మౌనము దాల్చి యుండువాడు ( మౌనముకలవాడు ) - | ( ఋషి ) |
| 12) సుగ్రీవుడు | - | మంచి కంఠం కలవాడు | |
| 13) విశ్వనాధుడు | - | విశ్వానికి ప్రభువు - | ( ఈశ్వరుడు ) |
| 14) శివుడు | - | శుభాలను ఇచ్చేవాడు - | ( ఈశ్వరుడు ) |
| 15) శ్రియఃపతి | - | లక్ష్మికి పతి - | ( విష్ణువు ) |
| 16) బుధుడు | - | అన్నింటిని ఎఱిగినవాడు - | ( పండితుడు ) |
| 17) పయోనిధి | - | ఉదకములను ధరించునది - | ( సముద్రము ) |
| 18) వనజనేత్ర | - | పద్మముల వంటి కన్నులు కలది - | ( స్త్రీ ) |
| 19) లే(దీగెజోడి | - | లేత తీగ వంటి శరీరం కలది - | ( స్త్రీ ) |
| 20) అతిధి | - | తిధి నియములు లేకుండ వచ్చేవాడు | ( అతిధి ) |
| 21) పురంధ్రి | - | గృహమును ధరించునది - | ( గృహిణి ) |
| 22) అహిమ భానుడు | - | చల్లనివి కాని కిరణములు గలవాడు - | ( సూర్యుడు ) |
| 23) ముక్కంటి | - | మూడు కన్నులు కలవాడు - | ( శివుడు ) |
| 24) పంచజనుడు | - | ఐదు భూతములచే పుట్టబడే వాడు - | ( మనిషి ) |
| 25) పార్వతి | - | ప ర్వతము యొక్క పుత్రిక - | ( గౌరి ) |
| 26) పార శర్యుడు | - | పరాశర మహర్షి యొక్క కుమారుడు - | ( వ్యాసుడు ) |
| 27) వ్యాసుడు | - | వేదములను విభజించి ఇచ్చిన వాడు - | ( వ్యాస మహర్షి ) |
| 28) చిత్రగ్రీవము | - | చిత్రమైన వర్ణాలతో కూడిన కంఠం కలది - | ( పావురం ) |
| 29) పతివ్రత | - | పతిని సేవించుటయె వ్రతంగా కలిగినది - | ( సాధ్వి ) |
| 30) అమృుతం | - | మరణం పొందింపనిది - | ( సుధ ) |
| 31) భవాని | - | భవు ని ( శివుని భార్య - | ( పార్వతి ) |

32) మూషికం - అన్నాదులను దొంగిలించునది - ( ఎలుక,పంది కొక్కు )

33) మోక్షం - జీవుడిని పాశము నుండి విడిపించునది - ( ముక్తి )

34) వనజం - వనము (నీరు ) నందు పుట్టినది - ( పద్మము )

35) స్నేహితుడు - సర్వభూతముల యందు స్నేహయుక్తుడు – (మిత్రుడు )

36) హర్మ్యము - మనోహరముగా ఉండేది ( మేడ )

37) చైత్యం - పా షాణాదులచే కట్టబడేది ( బౌద్ధస్తూపం )

38) ఆరామం - ఇందులో క్రీడిస్తారు ( ఉపవనము )

39) కవి - చాతుర్యంగా వర్ణించేవాడు ( కవి )

40) అక్షతలు - క్షతము లేనివి ( అమక్షితలు )

41) సాక్షి - ఏదేని ఒక కార్యాన్ని స్వయంగ చూసిన వాడు

42) శరీరము - రోగాదులచే హింసింపబడి శిథిలమయ్యేది ( దేహము )

43) విద్యార్థులు - విద్యలను కోరి వచ్చేవారు ( శిష్యులు )

44) వజ్రము - అడ్డము లేక పోవునట్టిది ( వజ్రము )

45) ధరణి - విశ్వమును ధరించేది ( భూమి )

46) భాస్కరుడు - కాంతిని కలుగ జేయువాడు ( సూర్యుడు )

47) పయోనిది - దీనియందు నీరు నిలిచియుండును ( సముద్రం )

48) పయోధి - నీటికి ఆధారమైనది ( సముద్రం )

49) దాశరధి - దశరధుని యొక్క కుమారుడు ( శ్రీ రాముడు )

50) ధరాధరము - భూమిని ధరించునది ( పర్వతం )

51) తరంగము - దరి చేరినది ( అల )

52) కపి - చలించేది ( కోతి )

53) పారావారము - అపారమైన తీరము గలది ( సముద్రం )

54) దానవులు - దనువు అనెది స్త్రీ వల్ల పుట్టిన వారు ( రాక్షసులు )

55) ఏటి జోటి మగడు - నదీ కాంతకు భర్త - ( సముద్రం )

56) హరి - 1.చీకటిని హరించెవాడు ( సూర్యుడు ) 2.భక్తుల హృదయాలు ఆకర్షించేవాడు ( విష్ణుమూర్తి ) 3.గజాదులను హరించునది ( సింహం )

57) కార్ముకం - యుద్ధ కర్మ కొఱకు సమర్థమైనది ( విల్లు )

58) పవనాశనులు - గాలి ఆహారముగా కలవి ( సర్పములు )

59) ప్రభంజనుడు - వృక్షశాఖాదులను విరుగగొట్టేవాడు ( వాయువు )

60) కరి - కరము (తొండము) కలది - ( ఏనుగు )

61) ఝరి - కాలక్రమమున స్వల్పమైనపోవునది ( ప్రవాహం )

# సంధులు

| సంధి పదం | | విసంధి | | సంధి పేరు |
|---|---|---|---|---|
| 1) రజనీశ్వరుడు | - | రజని + ఈశ్వరుడు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 2) అత్యంత | - | అతి + అంత | = | యణాదేశ సంధి |
| 3) వంటాముదము | - | వంట + ఆముదము | = | అకార సంధి |
| 4) ఏమనిరి | - | ఏమి + అనిరి | = | ఇకార సంధి |
| 5) అవ్విధంబున | - | ఆ + విధంబున | = | త్రిక సంధి |
| 6) సముత్సుకాకృతి | - | సముత్సుక + ఆకృతి | = | సవర్ణదీర్ఘ సంధి |
| 7) చంద్రి కాంభోది | - | చంద్రికా + అంభోధి | = | సవర్ణదీర్ఘ సంధి |
| 8) చందనాసారము | - | చందన + ఆసారము | = | సవర్ణదీర్ఘ సంధి |
| 9) దివసేంద్రుడు | - | దివస + ఇంద్రుడు | = | గుణసంధి |
| 10) చంద్రకాంతోపలంబులు | - | చంద్రకాంత + ఉపలంబులు | = | గుణసంధి |
| 11) అభినుతేందుచంద్రిక | - | అభినుత + ఇందు చంద్రిక | = | గుణసంధి |
| 12) కరవటంబన | - | కరవటంబు + అన | = | ఉత్వసంధి |
| 13) ఖండమమరె | - | ఖండము + అమరె | = | ఉత్వసంధి |
| 14) ధీరంబైన | - | ధీరంబు + ఐన | = | ఉత్వసంధి |
| 15) పండువులై | - | పండువులు + ఐ | = | ఉత్వసంధి |
| 16) రంజనౌషధము | - | రంజన + ఔషధం | = | వృద్ధి సంధి |
| 17) సరసపుమాట | - | సరసము + మాట | = | పుంప్వాదేశసంధి |
| 18) సింగపుకొదమ | - | సింగము + కొదమ | = | పుంప్వాదేశసంధి |
| 19) ముత్యపుచిప్ప | - | ముత్యము + చిప్ప | = | పుంప్వాదేశసంధి |
| 20) కావ్యామృతము | - | కావ్య + అమృతము | = | సవర్ణదీర్ఘ సంధి |
| 21) మనస్తాపము | - | మనః + తాపము | = | విసర్గ సంధి |
| 22) ఇట్లనియె | - | ఇట్లు + అనియె | = | ఉకార సంధి |
| 23) అచ్చోట | - | ఆ + చోట | = | త్రిక సంధి |
| 24) నేనక్కడ | - | నేను + అక్కడ | = | ఉకార సంధి |
| 25) పుణ్యావాసము | - | పుణ్య + ఆవాసము | = | సవర్ణదీర్ఘ సంధి |
| 26) మదోన్మాదము | - | మద + ఉన్మాదము | = | గుణసంధి |

| | | | | |
|---|---|---|---|---|
| 27) స్నిగ్ధాంబుద | - | స్నిగ్ధ + అంబుధ | = | సవర్ణదీర్ఘ సంధి |
| 28) సరభసోత్సాహం | - | సరభస + ఉత్సాహం | = | గుణసంధి |
| 29) గుణౌద్ధత్యం | - | గుణ + ఔద్ధత్యం | = | వృద్ధి సంధి |
| 30) రసైక స్థితి | - | రస + ఏక స్థితి | = | వృద్ధి సంధి |
| 31) బంధమూడ్చి | - | బంధము + ఊడ్చి | = | ఉత్వ సంధి |
| 32) అవ్వారల | - | ఆ + వారల | = | త్రిక సంధి |
| 33) భక్తురాలు | - | భక్త + ఆలు | = | రుగాగమ సంధి |
| 34) బాలెంతరాలు | - | బాలెంత + ఆలు | = | రుగాగమ సంధి |
| 35) గుణవంతురాలు | - | గుణవంత + ఆలు | = | రుగాగమ సంధి |
| 36) దేశాలలో | - | దేశము + లలో | = | ులనల సంధి |
| 37) పుస్తకాలు | - | పుస్తకము + లు | = | ులనల సంధి |
| 38) సమయాన | - | సమయము+న | = | ులనల సంధి |
| 39) వాఙ్మయం | - | వాక్+మయం | = | అనునాసిక సంధి |
| 40) రాణ్మహేంద్రవరం | - | రాట్ + మహేంద్రవరం | = | అనునాసిక సంధి |
| 41) జగన్నాథుడు | - | జగత్ + నాథుడు | = | అనునాసిక సంధి |
| 42) తన్మయము | - | తత్ + మయం | = | అనునాసిక సంధి |
| 43) మరున్నందనుడు | - | మరుత్ + నందనుడు | = | అనునాసిక సంధి |
| 44) అహోహో | - | అహ + అహ | = | ఆమ్రేడిత సంధి |
| 45) ఏమేమి | - | ఏమి + ఏమి | = | ఆమ్రేడిత సంధి |
| 46) అక్కడక్కడ | - | అక్కడ + అక్కడ | = | ఆమ్రేడిత సంధి |
| 47) పట్టపగలు | - | పగలు + పగలు | = | ఆమ్రేడిత సంధి |
| 48) పూరెమ్మ | - | పూవు + రెమ్మ | = | ప్రా తాది సంధి |
| 49) మీగడ | - | మీదు + కడ | = | ప్రా తాది సంధి |
| 50) ప్రాయిల్లు | - | ప్రాత + ఇల్లు | = | ప్రా తాది సంధి |
| 51) కెందామరలు | - | కెంపు + తామరలు | = | ప్రా తాది సంధి |
| 52) పూదోట | - | పూవు + తోట | = | ప్రా తాది సంధి |
| 53) శోకాగ్ని | - | శోక + అగ్ని | = | సవర్ణదీర్ఘ సంధి |
| 54) ఏమది | - | ఏమి + అది | = | ఇత్వ సంధి |

| | | | | |
|---|---|---|---|---|
| 55) పాపాచారులు | - | పాప + ఆచారులు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 56) భరతావని | - | భారత + అవని | = | సవర్ణదీర్ఘ సంధి |
| 57) భవదాజ్ఞ | - | భవత్ + ఆజ్ఞ | = | జశ్త్వ సంధి |
| 58) దుశ్చరితము | - | దుస్ + చరితము | = | శ్చుత్వ సంధి |
| 59) పుట్టినిల్లు | - | పుట్టిన + ఇల్లు | = | అత్వ సంధి |
| 60) నెచ్చెలి | - | నెఱ + చెలి | = | ప్రాతాది సంధి |
| 61) గ్రామోద్ధరణము | - | గ్రామ + ఉద్దరణము | = | గుణ సంధి |
| 62) మనోహరము | - | మనః + హరము | = | విసర్గ సంధి |
| 63) పల్లెటూరు | - | పల్లె + ఊరు | = | టుగాగమ సంధి |
| 64) పయోనిధి | - | పయః + నిధి | = | విసర్గ సంధి |
| 65) మనశ్శాంతి | - | మనః + శాంతి | = | విసర్గ సంధి |
| 66) అంతరాత్మ | - | అంతః + ఆత్మ | = | విసర్గ సంధి |
| 67) నిష్ఫలం | - | నిః + ఫలము | = | విసర్గ సంధి |
| 68) నమస్కారము | - | నమస్ + కారము | = | విసర్గ సంధి |
| 69) వనస్పతి | - | వనస్ + పతి | = | విసర్గ సంధి |
| 70) అభ్యుదయం | - | అభి + ఉదయం | = | యణాదేశ సంధి |
| 71) సత్యోక్తి | - | సత్య + ఉక్తి | = | గుణసంధి |
| 72) నిరాడంబరము | - | నిః + ఆడంబరము | = | విసర్గ సంధి |
| 73) దురభిమానము | - | దుః + అభిమానము | = | విసర్గ సంధి |
| 74) తేనెటీగ | - | తేనె + ఈగ | = | టుగాగమ సంధి |
| 75) తపోధనుడు | - | తపః + ధనుడు | = | విసర్గ సంధి |
| 76) నిలువుటద్దం | - | నిలువు + అద్దం | = | టుగాగమ సంధి |
| 77) చేయునతడు | - | చేయు + అతడు | = | నుగాగమ సంధి |
| 78) వచ్చునపుడు | - | వచ్చు + అప్పుడు | = | నుగాగమ సంధి |
| 79) పోవునట్లు | - | పోవు + అట్లు | = | నుగాగమ సంధి |
| 80) కలుగునప్పుడు | - | కలుగు + అప్పుడు | = | నుగాగమ సంధి |
| 81) తళుకున్గజ్జెలు | - | తళుకు + గజ్జెలు | = | నుగాగమ సంధి |
| 82) సరసపున్దనము | - | సరసపు + తనము | = | నుగాగమ సంధి |

83) తెల్లన్దనము - తెల్ల + తనము = నుగాగమ సంధి
84) భావోద్రేకం - భావ + ఉద్రేకం = గుణ సంధి
85) ప్రోత్సాహం - ప్ర + ఉత్సాహం = గుణ సంధి
86) అతిశయోక్తి - అతిశయ + ఉక్తి = గుణ సంధి
87) ప్రత్యర్థులు - ప్రతి + అర్థులు = యణాదేశ సంధి
88) ఇంతింత - ఇంత + ఇంత = ఆమ్రేడిత సంధి
89) పూరిల్లు - పూరి + ఇల్లు = ఇకార సంధి
90) సందేహపడు - సందేహము + పడు = పడ్వాది సంధి
91) భంగపడు - భంగము + పడు = పడ్వాది సంధి
92) పుణ్యోదకములు - పుణ్య + ఉదకములు = గుణ సంధి
93) అభ్యంతరం - అభి + అంతరం = యణాదేశ సంధి
94) పుణ్యాత్ముడు - పుణ్య + ఆత్ముడు = సవర్ణదీర్ఘ సంధి
95) అమ్మహాత్ముడు - ఆ + మహాత్ములు = త్రిక సంధి
96) ఆనందాన్నిచ్చిన - ఆనందాన్ని + ఇచ్చిన = ఇత్వ సంధి
97) జీవనోపాధి - జీవన + ఉపాధి = గుణ సంధి
98) సహస్రాబ్దం - సహస్ర + అబ్దం = సవర్ణదీర్ఘ సంధి
99) మేమంత - మేము + అంత = ఉత్వసంధి
100) నిరాశ - నిః + ఆశ = విసర్గ సంధి
101) సాధి కారం - స + అధికారం = సవర్ణదీర్ఘ సంధి
102) నిట్ట నిలువు - నిలువు + నిలువు = ఆమ్రేడిత సంధి
103) తెల్లందనము - తెల్ల + తనము = నుగాగమ సంధి
104) కట్టెదుట - కడు + ఎదుట = ద్విరుక్తటకార దేశ సంధి
105) చింతాకు - చింత + ఆకు = అత్వ సంధి
106) తూగుటుయ్యేల - తూగు + ఉయ్యేల = టుగాగమ సంధి
107) నట్టడవి - నడు + అడవి = ద్విరుక్తటకార దేశ సంధి
108) రామయ్య - రామ + అయ్య = అత్వ సంధి
109) సజ్జనుడు - సత్ + జనుడు = శ్చుత్వ సంధి
110) సచ్చరితము - సత్ + చరితము = శ్చుత్వ సంధి

| | | | | |
|---|---|---|---|---|
| 111) నిశ్చింత | - | నిస్ + చింత | = | శ్చుత్వ సంధి |
| 112) సచ్ఛాత్రుడు | - | సత్ + ఛాత్రుడు | = | శ్చుత్వ సంధి |
| 113) శరచ్చంద్రికలు | - | శరత్ + చంద్రికలు | = | శ్చుత్వ సంధి |
| 114) జగజ్జనని | - | జగత్ + జనని | = | శ్చుత్వ సంధి |
| 115) శార్జిఙ్జయః | - | శార్జిన్ + జయః | = | శ్చుత్వ సంధి |
| 116) స్వార్థం | - | స్వ + అర్థం | = | సవర్ణ దీర్ఘ సంధి |
| 117) అహరహం | - | అహః + అహం | = | విసర్గ సంధి |
| 118) అడ్డంపెట్టు | - | అడ్డము + పెట్టు | = | పడ్వాది సంధి |
| 119) పుణ్యాంగన | - | పుణ్య + అంగన | = | సవర్ణదీర్ఘ సంధి |
| 120) బింబాస్య | - | బింబ + ఆస్య | = | సవర్ణదీర్ఘ సంధి |
| 121) శిఖాధిరూఢ | - | శిఖ + అధిరూఢ | = | సవర్ణదీర్ఘ సంధి |
| 122) తల్లిదండ్రులు | - | తల్లి + తండ్రి | = | గసడదవాదేశ సంధి |
| 123) ముంజేయి | - | ముందు + చేయి | = | ప్రాతాది సంధి |
| 124) చిట్ట చివర | - | చివర + చివర | = | ఆమ్రేడిత సంధి |
| 125) మొట్టమొదలు | - | మొదలు + మొదలు | = | ఆమ్రేడిత సంధి |
| 126) రామేశ్వరం | - | రామ + ఈశ్వరం | = | గుణ సంధి |
| 127) కొండంత | - | కొండ + అంత | = | అకార సంధి |
| 128) రాజునాజ్ఞ | - | రాజు + ఆజ్ఞ | = | నుగాగమ సంధి |
| 129) ముఖ్యాంశం | - | ముఖ్య + అంశం | = | సవర్ణదీర్ఘ సంధి |
| 130) యివ్వీటి | - | ఈ + వీడు | = | త్రిక సంధి |
| 131) మునీశ్వర | - | ముని + ఈశ్వర | = | సవర్ణదీర్ఘ సంధి |
| 132) వేదోక్త | - | వేద + ఉక్త | = | గుణ సంధి |
| 133) విద్యాలయం | - | విద్య + ఆలయం | = | సవర్ణదీర్ఘ సంధి |
| 134) నవ్యాంధ్ర | - | నవ్య + ఆంధ్ర | = | సవర్ణదీర్ఘ సంధి |
| 135) మతాచారాలు | - | మత + ఆచారాలు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 136) అమరామరం | - | అమర + ఆరామం | = | సవర్ణదీర్ఘ సంధి |
| 137) పంచారామం | - | పంచ + ఆరామం | = | సవర్ణదీర్ఘ సంధి |
| 138) జ్ఞానార్జన | - | జ్ఞాన + ఆర్జన | = | సవర్ణదీర్ఘ సంధి |

| | | | | |
|---|---|---|---|---|
| 139) పట్టాభిషేకం | - | పట్ట + అభిషేకం | = | సవర్ణదీర్ఘ సంధి |
| 140) అశేషాంధ్రులు | - | అశేష + ఆంధ్రులు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 141) చిరాయువు | - | చిర + ఆయువు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 142) పరమావధి | - | పరమ + అవధి | = | సవర్ణదీర్ఘ సంధి |
| 143) బౌద్ధారామాలు | - | బౌద్ధ + ఆరామాలు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 144) వైభవోపేతం | - | వైభవ + ఉపేతం | = | గుణ సంధి |
| 145) మహోజ్జ్వల | - | మహా + ఉజ్జ్వల | = | గుణ సంధి |
| 146) అత్యాధునికం | - | అతి + ఆధునికం | = | యణాదేశ సంధి |
| 147) అత్యద్భుతం | - | అతి + అద్భుతం | = | యణాదేశ సంధి |
| 148) అత్యున్నత | - | అతి + ఉన్నత | = | యణాదేశ సంధి |
| 149) సున్నపు రాయి | - | సున్నము + రాయి | = | పుంప్వాదేశ సంధి |
| 150) చెల్లాచెదురు | - | చెదరు + చెదరు | = | ఆమ్రేడిత సంధి |
| 151) భయపడు | - | భయము + పడు | = | పడ్వాది సంధి |
| 152) సూక్తి | - | సు + ఉక్తి | = | సవర్ణదీర్ఘ సంధి |
| 153) లవణాబ్ధి | - | లవణ + అబ్ధి | = | సవర్ణదీర్ఘ సంధి |
| 154) దేహాత్మలు | - | దేహ + ఆత్మలు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 155) శ్రీకాళహస్తీశ్వరుడు | - | శ్రీకాళహస్తి + ఈశ్వరుడు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 156) సదాచారము | - | సత్ + ఆచారము | = | జశ్త్వ సంధి |
| 157) అదెట్లు | - | అది + ఎట్లు | = | ఇకార సంధి |
| 158) కాదని | - | కాదు + అని | = | ఉకార సంధి |
| 159) ఇద్ధరణిన్ | - | ఈ + ధరణిన్ | = | త్రిక సంధి |
| 160) ఎగసినట్లు | - | ఎగసిన + అట్లు | = | అకార సంధి |
| 161) బిట్టూది | - | బిట్టు + ఊది | = | ఉకార సంధి |
| 162) గట్టెక్కి | - | గట్టు + ఎక్కి | = | ఉకార సంధి |
| 163) అక్కొండ | - | ఆ + కొండ | = | త్రిక సంధి |
| 164) అచ్చెల్వ | - | ఆ + చెల్వ | = | త్రిక సంధి |
| 165) దవాగ్ని | - | దవ + అగ్ని | = | సవర్ణదీర్ఘ సంధి |
| 166) కూటాగ్రవీధి | - | కూట + అగ్రవీధి | = | సవర్ణ దీర్ఘ సంధి |

| | | | | |
|---|---|---|---|---|
| 167) మహోపలములు | - | మహా + ఉపలములు | = | గుణ సంధి |
| 168) నభోవీధి | - | నభః + వీధి | = | విసర్గ సంధి |
| 169) యశోవసనంబు | - | యశః + వసనంబు | = | విసర్గ సంధి |
| 170) హరియపుడు | - | హరి + అపుడు | = | య డా గ మ సంధి |
| 171) పురాభిముఖుడు | - | పుర + అభిముఖుడు | = | సవర్ణదీర్ఘ సంధి |
| 172) వాడుగొట్టె | - | వాడు + కొట్టె | = | గ స డ ద వా దేశ సంధి |
| 173) నీవు డక్కరి | - | నీవు + టక్కరి | = | గ స డ ద వా దేశ సంధి |
| 174) వారువోరు | - | వారు + పోరు | = | గ స డ ద వా దేశ సంధి |
| 175) రారుగదా | - | రారు+కదా | = | గ స డ ద వా దేశ సంధి |
| 176) అణగదొక్కి | - | అణగన్+తొక్కి | = | సరళాదేశ సంధి |

# సమాసాలు

| సమాసం | | విగ్రహ వాక్యం | | సమాసం పేరు |
|---|---|---|---|---|
| 1) రజనీకర బింబం | - | రజనీకరుని యొక్క బింబం | - | షష్ఠీ తత్పురుష సమాసం |
| 2) నిశాసతి | - | నిశ అనెడి సతి | - | రూపక సమాసం |
| 3) మతి హీనుడు | - | మతి చేత హీనుడు | - | తృతీయ తత్పురుష సమాసం |
| 4) విద్యాధికులు | - | విద్య చేత అధికులు | - | తృతీయ తత్పురుష సమాసం |
| 5) కాంతారత్నము | - | కాంతలలో రత్నము | - | షష్ఠీ తత్పురుష సమాసము |
| 6) ధనహీనుడు | - | ధనము చేత హీనుడు | - | తృతీయ తత్పురుష సమాసం |
| 7) జటావల్లి | - | వల్లి వంటి జట | - | ఉపమాన ఉత్తర పద కర్మధారయ సమాసం |
| 8) భిక్షాటనం | - | భిక్ష కొరకు ఆటనము | - | చతుర్థీ తత్పురుష సమాసం |
| 9) నీలాకాసమ | - | నీలమైన ఆకాశము | - | విశేషణ పూర్వ పద కర్మధారయ సమాసం |
| 10) మూడు లోకాలు | - | మూడు సంఖ్య గల లోకాలు | - | ద్విగు సమాసం |
| 11) సేనా వాహిని | - | సేన యనెడి వాహిని | - | రూపక సమాసం |
| 12) పావన చరిత్ర | - | పావనమైన చరిత్ర గలది | - | బహువ్రీహి సమాసం |
| 13) కాశీ నగరం | - | కాశీ అనే పేరు గల నగరం | - | సంభావనా పూర్వ పద కర్మధారయ సమాసం |
| 14) చిత్ర గ్రీవమ | - | చిత్రమైన గ్రీవము కలది | - | బహు వ్రీహి సమాసం |
| 15) అన్న వస్త్రములు | - | అన్నమును , వస్త్రమును | - | ద్వంద్వ సమాసం |
| 16) నెల తాల్పు | - | నెలను తాల్చిన వాడు | - | ద్వితీయ తత్పురుష సమాసం |
| 17) ప్రతి దినము | - | దినము , దినమూ | - | అవ్యయీ భావ సమాసం |
| 18) గుర దక్షిణ | - | గురువు కొఱకు దక్షిణ | - | చతుర్థీ తత్పురుష సమాసం |
| 19) వాదనా పటిమ | - | వాదన యందు పటిమ | - | సప్తమీ తత్పురుష సమాసం |
| 20) వయో వృద్ధుడు | - | వయసు చేత వృద్ధుడు | - | తృతీయ తత్పురుష సమాసం |
| 21) దొంగ భయము | - | దొంగ వలన భయము | - | పంచమీ తత్పురుష సమాసం |
| 22) నిమలిత నేత్రుడు | - | నిమిలితములైన నేత్రములు కలవాడు | - | బహువ్రీహి సమాసం |
| 23) అందచందములు | - | అందమును,చందమును | - | ద్వందసమాసం |
| 24) ప్రముఖదినము | - | ప్రముఖమైన దినము | - | విశేషణ పూర్వపదకర్మధారయసమాసం |
| 25) మచ్చెకంటి | - | మచ్చెము వంటి కన్నులు కలది | - | బహువ్రీహిసమాసం |
| 26) మహాత్ముడు | - | గొప్ప ఆత్మ కలవాడు | - | బహువ్రీహిసమాసం |
| 27) కఠిన పరీక్ష | - | కఠినమైన పరీక్ష | - | విశేషణ పూర్వపదకర్మధారయసమాసం |
| 28) దేశభక్తి | - | దేశము నందలి భక్తి | - | సప్తమీ తత్పురుష సమాసం |
| 29) వితంతు వివాహం | - | వితంతువు యొక్క వివాహం | - | షష్ఠి తత్పురుష సమాసం |
| 30) కాలు సేతుల | - | కాలు మరియు చేయి | - | ద్వంద్వ సమాసం |

| | | |
|---|---|---|
| 31) స్త్రీల విద్య | - స్త్రీల యొక్క విద్య | - షష్ఠి తత్పురుష సమాసం |
| 32) చంపకవతి పట్టణం | - చంపకవతి అనే పేరు గల పట్టణం | - సంభావన పూర్వపద కర్మాధారయ సమాసం |
| 33) నలుదెసలు | - నాలుగు సంఖ్య గల దెసలు | - ద్విగు సమాసం |
| 34) సూర్య చంద్రులు | - సూర్యుడును,చంద్రుడును | - ద్వంద్వసమాసం |
| 35) అనృతము | - నృతము కానిది | - నఞ్ తత్పురుష సమాసం |
| 36) సంసార విషవృక్షము | - సంసారమనెడి విషవృక్షము | - రూపక సమాసం |
| 37) కావ్యామృతము | - కావ్యము అనెడి అమృతము | - రూపక సమాసం |
| 38) అసాధ్యం | - సాధ్యం కానిది | - నఞ్ తత్పురుష సమాసం |
| 39) కళాకౌశలం | - కళ యందు కౌశలం | - సప్తమీ తత్పురుష సమాసం |
| 40) గంగానది | - గంగా అనే పేరు గల నది | - సంభావన పూర్వపద కర్మ ధారయ సమాసం |
| 41) భారతదేశం | - భారత అనే పేరు గల దేశం | - సంభావన పూర్వపద కర్మ ధారయ సమాసం |
| 42) మామిడి గున్న | - గున్నయైన మామిడి | - విశేషణ పూర్వపదకర్మధారయసమాసం |
| 43) పదాబ్జములు | - అబ్జములు వంటి పాదములు | - ఉపమాన ఉత్తర పద కర్మధారయ సమాసం |
| 44) కలువ కన్నులు | - కలువల వంటి కన్నులు | - ఉపమాన ఉత్తర పద కర్మధారయ సమాసం |
| 45) మృదు మధురము | - మృదువైనది,మధురమైనది | - విశేషణ పూర్వపదకర్మధారయసమాసం |
| 46) సపర్యాధుర్యుడు | - సపర్య యందు ధుర్యుడు | - సప్తమీ తత్పురుష సమాసం |
| 47) మదోన్మాదము | - మదము వలన ఉన్మాదము | - పంచమీ తత్పురుష సమాసం |
| 48) కన్నుఁగవ | - కన్నుల యొక్క కవ | - షష్ఠి తత్పురుష సమాసం |
| 49) గ్రామోద్ధరణ | - గ్రామాల యొక్క ఉద్ధరణ | - షష్ఠి తత్పురుష సమాసం |
| 50) జీవిత సౌఖ్యం | - జీవిత మందు సౌఖ్యం | - సప్తమీ తత్పురుష సమాసం |
| 51) బాడి బందలు | - బాడియు,బందయు | - ద్వంద్వ సమాసం |
| 52) పది రోజులు | - పది సంఖ్య గల రోజులు | - ద్విగు సమాసం |
| 53) వ్యోమ గంగ | - వ్యోమము నందలి గంగ | - సప్తమీ తత్పురుష సమాసం |
| 54) పుప్పొడి | - పూల యొక్క పొడి | - షష్ఠి తత్పురుష సమాసం |
| 55) ఆస్థాన కవి | - ఆస్థాన మందలి కవి | - సప్తమీ తత్పురుష సమాసం |
| 56) వేదోక్తము | - వేదము నందు ఉక్తము | - సప్తమీ తత్పురుష సమాసం |
| 57) శృంగార వనధి | - శృంగారం అనెడి వనధి | - రూపక సమాసం |
| 58) ఆబాల గోపాలం | - బాలుడి నుండి గోపాలుని వరకు | - అవ్యయీభావ సమాసం |
| 59) అనువర్షం | - వర్షం ననుసరించి | - అవ్యయీభావ సమాసం |
| 60)మధ్యాహ్నం | - అహ్నం మధ్య భాగం | - ప్రథమా తత్పురుష సమాసం |
| 61) యథాశక్తి | - శక్తి ఎంతో అంత(లేదా)శక్తి ననుసరించి | - అవ్యయీభావ సమాసం |
| 62) అనుకూలం | - కూలమును(అనగా ఒడ్డును)అనుసరించి | - అవ్యయీభావ సమాసం |

| | | | |
|---|---|---|---|
| 63) యథామూలం | - | మూలం ఎంతో అంత | - అవ్యయీభావ సమాసం |
| 64) అనాది | - | ఆది కానిది | - నఞ్ తత్పురుష సమాసం |
| 65) పద్య సంత్రాసం | - | పద్యము యొక్క సంత్రాసం | - షష్ఠి తత్పురుష సమాసం |
| 66) చిరునవ్వు | - | చిన్నదైన నవ్వు | - విశేషణ పూర్వ పద కర్మధారయ సమాసం |
| 67) ముగ్ధ మనోహరం | - | ముగ్ధం , మనోహరం | - విశేషణ ఉభయ పద కర్మధారయ సమాసం |
| 68) ద్వాఃకవాటము | - | ద్వారము యొక్క కవాటము | - షష్ఠి తత్పురుష సమాసం |
| 69) ఇందు బింబాస్య | - | ఇందు బింబము వంటి ఆస్యము కలది | - బహువ్రీహి సమాసం |
| 70) క్షుత్పిపాసలు | - | క్షుత్తు,పిపాస | - ద్వంద్వ సమాసం |
| 71) మోక్షలక్ష్మి | - | మోక్షము అనెడి లక్ష్మి | - రూపక సమాసం |
| 72) దివ్యాంబరం | - | దివ్యమైన అంబరం | - విశేషణ పూర్వపదకర్మధారయసమాసం |
| 73) సాహితీ జగత్తు | - | సాహితి అనెడి జగత్తు | - రూపక సమాసం |
| 74) సేవా వృత్తి | - | సేవ అనెడి వృత్తి | - రూపక సమాసం |
| 75) ధూప దీపములు | - | ధూపము మరియు దీపము | - ద్వంద్వ సమాసం |
| 76) మహా భాగ్యము | - | గొప్పదైన భాగ్యము | - విశేషణ పూర్వపదకర్మధారయసమాసం |
| 77) అసాధారణం | - | సాధారణం కానిది | - నఞ్ తత్పురుష సమాసం |
| 78) అన్న దమ్ములు | - | అన్న మరియు తమ్ముడు | - ద్వంద్వ సమాసం |
| 79) పతి భిక్ష | - | పతి కొఱకు భిక్ష | - చతుర్థి తత్పురుష సమాసం |
| 80) నిశా సతి | - | నిశ అనెడి సతి | - రూపక సమాసం |
| 81) దశ దిశలు | - | దశ సంఖ్య గల దిశలు | - ద్విగు సమాసం |
| 82) నాలుగు గీతలు | - | నాలుగు సంఖ్య గల గీతలు | - ద్విగు సమాసం |
| 83) మానవ చరిత్ర | - | మానవుల యొక్క చరిత్ర | - షష్ఠి తత్పురుష సమాసం |
| 84) ఆంధ్ర సామ్రాజ్యము | - | ఆంధ్రుల యొక్క సామ్రాజ్యము | - షష్ఠి తత్పురుష సమాసం |
| 85) కుల గురువు | - | కులమునకు గురువు | - షష్ఠి తత్పురుష సమాసం |
| 86) పాద స్పర్శ | - | పాదముల యొక్క స్పర్శ | - షష్ఠి తత్పురుష సమాసం |
| 87) నవ్యాంధ్ర | - | నవ్యమైన ఆంధ్ర | - విశేషణ పూర్వపదకర్మధారయసమాసం |
| 88) అమరావతి పట్టణం | - | అమరావతి పేరు గల పట్టణం | - సంభావన పూర్వపద కర్మధారయ సమాసం |
| 89) కృష్ణానది | - | కృష్ణ అనే పేరు గల నది | - సంభావన పూర్వపద కర్మధారయ సమాసం |
| 90) ఎత్తు పల్లాలు | - | ఎత్తును,పల్లమును | - ద్వంద్వసమాసం |
| 91) సంబంధ బాంధవ్యాలు | - | సంబంధమును,బాంధవ్యమును | - ద్వంద్వ సమాసం |
| 92) నవ నగరం | - | నవ సంఖ్య గల నగరము, | ద్విగు సమాసం |
| 93) నవ నగరం | | నవ్యమైన(కొత్తదైన) నగరము- | విశేషణ పూర్వపద కర్మధారయ సమాసం |
| 94) పంచారామాలు | - | పంచ సంఖ్య గల ఆరామములు | - ద్విగు సమాసం |

95) మూడు దశలు - మూడైన దశలు - ద్విగు సమాసం

96) శిల్ప సంపద - శిల్పము అనెడి సంపద - రూపక సమాసం

97) అనాదరణ - ఆదరణ లేని - నఞ్ తత్పురుష సమాసం

98) భక్త చింతామణి - భక్తులకు చింతామణి - షష్ఠి తత్పురుష సమాసం

99) సుధాధార - సుధ యొక్క ధార - షష్ఠి తత్పురుష సమాసం

100) తంతు సంతతులు - తంతువుల యొక్క సంతతులు - షష్ఠి తత్పురుష సమాసం

101) కరిరాజు - కరులకు రాజు - షష్ఠి తత్పురుష సమాసం

102) స్వభాష - తమ యొక్క భాష - షష్ఠి తత్పురుష సమాసం

103) ధర్మవర్తన - ధర్మమైన వర్తన - విశేషణ పూర్వపద కర్మధారయ సమాసం

104) తప్తలోపము - తప్తమైన లోపము - విశేషణ పూర్వపద కర్మధారయ సమాసం

105) శిరీషపుష్పము - శిరీషము అనే పేరు గల పుష్పము - సంభవన పూర్వపద సమాసం

106) దీనదేహులు - దీనమైన దేహులు కలవారు - భహువ్రీహి సమాసం

107) అనామకము - పేరు లేనిది - నఞ్ తత్పురుష సమాసం

108) కూట కోటులు - కూటముల యొక్క కోటులు - షష్ఠి తత్పురుష సమాసం

109) వప్ర పరిఘు - వప్రమునకు పరిఘు - షష్ఠి తత్పురుష సమాసం

110) నభోవీధి - ఆకాశమందలి వీధి - సప్తమీ తత్పురుష సమాసం

111) దవాగ్ని - దవము అనే అగ్ని - రూపక సమూసం

112) క్రోధ రసము - క్రోధము అనే పేరుగల రసం - సంభవన పూర్వపద సమాసం

113) కూటాగ్రము - కూటము యొక్క అగ్రము - షష్ఠి తత్పురుష సమాసం

114) కనుల పండువు - కనులకు పండువు - షష్ఠి తత్పురుష సమాసం

# ప్రకృతి - వికృతులు

| ప్రకృతి | - | వికృతి | ప్రకృతి | - | వికృతి |
|---|---|---|---|---|---|
| 1) సంధ్య | - | సందె,సంజ,సంద | 30) విజ్ఞానము | - | విన్నణము |
| 2) దిశ | - | దెస,దిస,దిస్స | 31) గుహతి | - | గొబలు,గవి |
| 3) ధర్మము | - | దమ్మము,దరమము | 32) విద్య | - | విద్దె,విద్దియ |
| 4) రాత్రి | - | రాతిరి,రేయి | 33) పంక్తి | - | బంతి |
| 5) నిశ | - | నిసి | 34) యాత్ర | - | జాతర |
| 6) గర్వము | - | గరువము | 35) ఆహారం | - | ఓగిరం |
| 7) యత్నము | - | జతనము | 36) ఉపాధ్యాయుడు | - | ఒజ్జ |
| 8) చంద్రుడు | - | చందురుడు | 37) కావ్యం | - | కబ్బం |
| 9) స్రవణము | - | సోన | 38) కుడ్యం | - | గోడ |
| 10) శంక | - | జంకు | 39) గుణం | - | గొనం,గొనయము |
| 11) కార్యము | - | కర్జము | 40) పక్షి | - | పక్కి |
| 12) గృహము | - | గీము | 41) పుత్రుడు | - | బొట్టెడు |
| 13) సంతోషము | - | సంతసము | 42) బ్రహ్మ | - | బమ్మ,బొమ్మ |
| 14) రాజ్ఞి | - | రాణి | 43) మౌక్తికం | - | ముత్తెం |
| 15) రత్నము | - | రతనము | 44) ముక్తం | - | ముత్తెం |
| 16) ఛాయ | - | చాయ | 45) మాణిక్యము | - | మానికము |
| 17) పుణ్యం | - | పున్నెం | 46) శంక | - | జంకు |
| 18) దోషము | - | దోసము | 47) సత్వము | - | సత్తువ |
| 19) అంబ | - | అమ్మ | 48) భోజనము | - | బోనం |
| 20) స్వామి | - | సామి | 49) శబ్దం | - | సద్దు |
| 21) శ్రీ | - | సిరి | 50) కార్యము | - | కర్జం |
| 22) దూరము | - | దవ్వు | 51) గృహము | - | గీము |
| 23) ప్రజ్ఞ | - | పగ్గె,పగ్గియ | 52) గౌరవం | - | గారవము |
| 24) ఆర్య | - | అయ్య | 53) శాస్త్రం | - | చట్టం |
| 25) శృంగారము | - | సింగారము | 54) ధర్మము | - | దమ్మము |
| 26) పుష్పము | - | పువ్వు | 55) సంతోషము | - | సంతసం |
| 27) భక్తి | - | బత్తి | 56) పట్టణము | - | పట్నము |
| 28) భాష | - | బాస | 57) శూన్యము | - | సున్న |
| 29) శరము | - | సరుడు | 58) కుల్య | - | కాలువ |

59) యముడు - జముడు
60) సన్యాసి - సన్నాసి
61) జ్యోతి - జోతి
62) భాగ్యము - బాగ్గెము
63) రాశి - రాసి
64) ఈర్ష్య - ఈసు
65) మణి - మిన్న
66) మర్యాద - మరియాద
67) సూక్తి - సుద్ది
68) స్త్రీ - ఇంతి
69) ఆశ్చర్యము - అచ్చెరువు, అక్కజము
70) నిత్యము - నిచ్చలు
71) హృదయము - ఎద,ఎడద
72) గర్భము - కడుపు
73) స్థిరము - తిరము
74) వస్త్రము - పాత
75) భేదము - బద్ధ
76) లక్ష్మి - లచ్చి
77) కవి - కయి
78) వ్రతము - బతము
79) జట - జడ
80) దీపము - దివ్వె, దివ్వియ
81) తపము - తబము
82) బహు - పెక్కు
83) స్థానము - తానము
84) రుద్రాక్ష - రుదురాక
85) కస్తూరి - కస్తురి
86) కవితలు - కైతలు
87) పద్యము - పద్దెము
88) పర్వము - పబ్బము

89) గుహ - గొబ
90) నిమిషము - నిముసము
91) పీఠము - పీట
92) భృంగారము - బంగారము
93) స్నేహము - నెయ్యము
94) పేటిక - పెట్టె
95) భిక్షము - బిచ్చము
96) ముత్స్యము - మచ్చెము
97) పంక్తి - బంతి
98) శిష్యుడు - చట్టు, సిసువుడు
99) స్వర్ణం - సొన్నము
100) పాయసము - పాసెము
101) విశ్వాసము - విసువాసము
102) బ్రాహ్మణుడు - బాపడు
103) తపస్వి - తపసి, తబిసి
104) శాల - సాల
105) రూపము - రూపు
106) ఆజ్ఞ - ఆన
107) ఆసక్తి - ఆసత్తి
108) ఈశ్వరుడు - ఈసరుడు
109) కష్టం - కస్తి
110) కాగితం - కాయితం
111) చిత్రం - చిత్తరువు
112) పక్షం - పక్క
113) పక్షి - పక్కి
114) భక్తి - బత్తి
115) లేఖ - లేక
116) రాట్ - ఱేడు
117) లక్ష్మి - లచ్చి
118) యంత్రం - జంత్రం

119) భాగ్యం - బాగ్గెం
120) అక్షతలు - అక్షింతలు
121) ఫలక - పలక
122) ద్వీపము - దిబ్బ
123) సాక్షి - సాకిరి
124) ప్రాంతము - పొంత
125) వక్రము - వంపు
126) నీరమ్ - నీరు
127) వజ్రమ్ - వజ్జరము
128) ఘట్టము - గట్టు
129) యశము - అసము
130) త్వర - తొర
131) మూర్ఖుడు - మొఱకు
132) యుగము - ఉగము
133) భీరుకుడు - పిఱికి
134) హితమ్ - ఇతము
135) కాకము - కాకి
136) న్యాయము - నాయము
137) భిదురకము - పిడుగు
138) జంఘ - జంగ
139) గుహ - గొబ
140) ఉపరి - ఉప్పరము
141) పుత్రుడు - పట్ట

# తెలుగు

## పదవ తరగతి

## పేపర్ - II - 40 మార్కులు

### PART - A - 30 మార్కులు

## I అవగాహన - ప్రతి స్పందన - 12 మార్కులు

I. **క్రింది వాక్యాలను సంఘటన క్రమంలో అమర్చండి** **4 X 1 = 4 మార్కులు**

II. **కింది పద్యం చదివి ప్రశ్నలకు జవాబులు రాయండి** **4 X 1 = 4 మార్కులు**

1. ఏరకు మీ కనుగాయలు --------------- గురువునాజ్ఞ మేదిని సుమతీ !
2. ఇసుమున తైలంబు దీయవచ్చు ----------- రంజింప రాదయా !
3. ఎప్పుడు తప్పులు వెదకెడు ------------- గదరా సుమతీ !
4. మాటకు బ్రాణము సత్యము ------- వ్రాలు సిద్ధము సుమతీ !
5. ఎరుక గలవారి చరితలు --------- సమంజన బుద్ధిన్
6. అక్షరంబు వలయు కుక్షి జీవనులకు --------- లోక రక్షితంబు
7. ద్యుమణి పద్మాకరము వికచముగ జేయు ----------- పరహితాచరణమతులు
8. సద్గోష్ఠి సిరియు నొసగును ---------- పాపములను చరచు కుమారా !
9. తరవు లతిరస ఫల భార గురుత గాంచు ----------- నిది సహజ గుణము
10. భరత ఖండంబు చక్కని పాడియావు --------- మూతులు బిగియ గట్టి
11. కుక్క గోవు గాదు : కుందేలు పులిగాదు ! దోమ గజము కాదు దొడ్డదైన ! లోభి దాత గాడు లోకంబు లోపల ! విశ్వదాభి రామ వినురమేమ
12. ఆత్మ శుద్ధి లేని ఆచారమది యేల ---- వినురవే
13. నలుగురు పలికెది పలుకులె ------ తెలివిగ భువిలో
14. చదువది ఎంత గల్గిన రసజ్ఞత ------------- రుచి పుట్టగ నేర్చు నటయ్య భాస్కరా !
15. విద్యచే భూషితుండయి --------- భయంకరము గాదె
16. నోచిన తల్లి దండ్రికి తనూభవడొక్కడే చాలు ----------- దాశరథీ ! కరుణాపయోనిధీ !
17. పూను స్పర్ధను విద్యలందే ! వైరముల వాణిజ్యమందే ! వ్యర్థ కలహం పెంచబోకోయి ! కత్తి వైరము కాల్చవోయి.
18. మొదలు జూచిన గడు గొప్ప పిదప గురుచ--------గుజన సజ్జనుల మైత్రి.
19. తలనుండు విషము ఫణికిని-----------ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ !

20. కష్ట సాధ్యమైన కార్యమ్ము నెరవెర్ప ! నైకమత్యమే మహాబలమ్ము ! పావురముల వలను పై కెత్తి కొని పోయే ! లలిత సుగుణ జాల తెలుగు బాల.

21. అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను--------

22. ఉడుముండదె నూరేండ్లును--------

23. భాండ శుద్ధిలేని---------

24. అనగననగ రాగ మతిశయిల్లుచు నుండు----------

25. కనకపు సింహాసనమున-------

26. పాల మీగడ మించిన పసిడి మనసు--------

**III . కింది పేరాను చదివి సరైన సమాధానాలు గుర్తించండి.** **4 X 1 = 4**

## II వ్యక్తీకరణ – సృజనాత్మకత - 18 మార్కులు

### 1. కింది ప్రశ్నలకు నాలుగైదు వాక్యాలలో సమాధానాలు రాయండి 2 X 2 = 4

1. రాముడు పాత్ర స్వభావాన్ని వివరించండి
2. హనుమంతుడు
3. సీత
4. సుగ్రీవుడు
5. లక్ష్మణుడు
6. విభీషణుడు
7. విశ్వామిత్రుడు
8. రావణుడు
9. అగస్త్యుడు
10. అహల్య
11. కైకేయి
12. మంథర
13. గుహుడు
14. శబరి
15. జనక మహారాజు
16. వాలి
17. "నీ చేతిలో చావడం కన్నా శ్రీరాముని చేతిలో చావడమే నయం"- అన్న మారీచుని మాటలను బట్టి మీరేమి గ్రహించారు
18. 'అమ్మా ! నువ్వు చెప్పినట్లే చేస్తా' అని కైకేయితో రాముడు పలికిన సన్నివేశాన్ని బట్టి మీరేం గ్రహించారు ?
19. బాల, అయోధ్య కాండల ఆధారంగా విశ్వామిత్రుడి స్వభావాన్ని వివరించండి
20. రామాయణాన్ని ఎందుకు చదవాలి ?
21. శ్రీరాముడు శివధనస్సును విరిచిన విధానాన్ని తెల్పండి
22. కైకేయి దశరథుని అడిగిన వరాలేమిటో రాయండి ?
23. రావణునితో విభీషణుడు ఎటువంటి హితోక్తులు పలికాడు ?
24. అహల్య శాప విమోచనం ఎలా కలిగిందో వివరించండి
25. శ్రీరాముని శబరి ఎలా ఆదరించిందో తెల్పండి
26. వాల్మీకి రామాయణం రాయడానికి స్ఫూర్తి ఏమిటని మీరు భావిస్తున్నారు ?
27. విశ్వామిత్రుని యాగాన్ని శ్రీరాముడు ఎలా సంరక్షణ చేశాడో రాయండి
28. కైకేయి మనసు మారడానికి మంథర దుర్బోధ కారణమని ఎట్ల చెప్పగలవు ?

**II.** కింది ప్రశ్నకు పది పన్నెండు వాక్యాలలో సమాధానాలు రాయండి **1 X 4 = 4**

1. రామాయణం చదవడం వల్ల వ్యక్తికి గానీ, సమాజానికి గానీ కలిగే ప్రయోజనమేమి ?
2. సీతాపహరణం జరగడానికి గల పరిస్థితులను విశ్లేషించండి
3. శ్రీరాముడు శివధనస్సును విరిచిన విధానాన్ని తెల్పండి
4. జ్ఞానాన్ని పొందడంలో నిరంతరం అప్రమత్తులై ఉండడం ఉత్తమ విధ్యార్థుల లక్షణం-సమర్థిస్తూ రాయండి
5. రామయణం ఆధారంగా అన్నదమ్ముల అనుబంధాన్ని విశ్లేషించండి
6. రామాయణంలో మీకు నచ్చిన పాత్ర ఏది? ఎందుకో తెల్పండి
7. భారతీయ జీవన విధానానికి రామాయణం మార్గదర్శకమని నీవెలా చెప్పగలవు ?
8. రామాయణంలోని ఆదర్శ పాత్ర లేవి? అవి ఎందుకు ఆదర్శ పాత్రలుగా నిలిచాయో రాయండి
9. రామాయణంలో రామలక్ష్మణుల ఆధారంగా సోదర ప్రేమలో నువ్వు గ్రహించిన విషయాలేవి ?
10. బాలకాండలో జరిగిన కథను పది, పన్నెండు వాక్యాలలో రాయండి
11. శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతంగా వనవసానికి ఎందుకు వేళ్ళాల్సి వచ్చింది
12. రావణుడు మారీచుని సాయంతో సీతాదేవిని అపహరించిన వృత్తాంతాన్ని రాయండి
13. శ్రీరాముని పితృభక్తిని సొంత మాటల్లో రాయండి
14. శ్రీరాముడు, సుగ్రీవుల మైత్రి గురించి సొంత మాటల్లో రాయండి

**III.** కింది వానిలో ఏవైనా రెండు ప్రశ్నలకు సమాధానాలు రాయండి **2 X 5 = 10**

## లేఖలు

1. వ్యక్తిత్వ, విద్యా, బదిలీ ధృవీకరణ పత్రాలను ఇప్పించవలసినదిగా కోరుతూ ప్రధానోపాధాయుల గారికి లేఖ రాయండి
2. మీ పాఠశాలలో 'గ్రంథాలయ వసతి' కల్పించమని కోరుతూ సంబంధిత అధికారికి లేఖ రాయండి
3. 'స్వచ్ఛ భారత్' ప్రాముఖ్యతను తెలియజేస్తూ, మిత్రునికి లేఖ రాయండి
4. మీ అన్నయ్య పెళ్ళికి వెళ్ళుటకు మూడు రోజులు సెలవు కోరుతూ ప్రధానోపాధ్యాయుల గారికి లేఖ రాయండి
5. మీ పాఠశాలలో జరిగిన వార్షికోత్సవాన్ని గురించి మిత్రునకు లేఖ రాయండి
6. మీ వీధిలో మంచినీటి సమస్య గురించి వివరిస్తూ సంబంధిత అధికారికి లేఖ రాయండి
7. 'కోపం తగ్గించు కోవడం మంచిది' అనే అంశాన్ని ప్రభోదిస్తూ మిత్రునికి లేఖ రాయండి

## వ్యాసాలు

1. కాలుష్యంతో నిండిపోతున్న నేటి నగర వాతావరణం గురించి ఒక వ్యాసం రాయండి
2. మీరు దర్శించిన ఏదైనా పర్యాటక క్షేత్రం గురించి వర్ణిస్తూ రాయండి
3. మీ పాఠశాల గురించి మంచి మంచి పదాలతో ఆకర్షణీయంగా వర్ణించండి
4. 'పరిసరాల-పచ్చదనం' గురించి క్లుప్తంగా వ్యాసం రాయండి.
5. నగరంలోని ప్రధాన సమస్య పరిసరాల కాలుష్యం వల్ల కలిగే అనర్థాలను వివరిస్తూ ఒక వ్యాసం రాయండి

## కర పత్రాలు

1. 'మహిళల-రక్షణ' మన కర్తవ్యం అనే అంశంపై కరపత్రం రాయండి
2. స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలను ఖండిస్తూ, వారిని గౌరవించాలని తెలుపుతూ ఒక కరపత్రం తయారు చేయండి
3. 'వందేమాతరానికి వందేళ్ళు' పూర్తయిన సందర్భాన్ని గుర్తు చేస్తూ ఒక కరపత్రాన్ని తయారు చేయండి
4. నీటిని పొదుపుగా వాడాలనే విషయంలో మీ ఊరి ప్రజలను చైతన్య వంతులను చేయడానికి 'కరపత్రం' తయారు చేయండి
5. స్త్రీలకు విద్య అవసరమని తెలుపుతూ ఒక కరపత్రం తయారు చేయండి
6. జన్మభూమి ప్రాముఖ్యతను వివరిస్తూ ఒక కరపత్రం తయారు చేయండి
7. 'స్వచ్ఛ భారత్' ప్రాముఖ్యతను తెలియజేస్తూ ఒక కరపత్రం తయారు చేయండి
8. ఉపాధ్యాయులను గౌరవించాలని ప్రభోదిస్తూ ఒక కరపత్రాని తయారు చేయండి
9. మాతృ భాషలో విద్యాభ్యాసం చేయాలని కోరుతూ ఒక కరపత్రాన్ని తయారు చేయండి
10. మొక్కలు నాటడం వలన కలిగే ప్రయోజనాలను వివరిస్తూ ఒక కరపత్రం తయారు చేయండి
11. బాల్య వివాహాలపై ఒక కరపత్రం తయారు చేయండి

## III భాషాంశాలు - 10 మార్కులు

### PART - B 10 మార్కులు

| | | |
|---|---|---|
| 1. ఆధునిక భాషా పరివర్తనం చేయుట | - | 1 మార్కులు |
| 2.కర్తరి - కర్మణి వాక్యాలు | - | 1 |
| 3. ప్రత్యక్ష - పరోక్ష వాక్యాలు | - | 1 |
| 4. జాతీయాలను వివరించుట | - | 1 |
| 5. పదాలను వాక్యాలలో ప్రయోగించుట | - | 1 |
| **(**సొంత వాక్యాలు**)** | | |
| 6. వ్యతి రేక వాక్యాలు | - | 1 |
| 7. వాక్యం | - | 1 |
| 8. అసమాపక క్రియా వాక్యాలు | - | 1 |
| 9. వాక్య భేదాలు | - | 2 |
| | | 10 |

# PAPER - II    PART - B

## ఆధునిక భాషా పరివర్తనం

## ఈ క్రింది వాక్యాలకు ఆధునిక భాషా పరివర్తనం చేయండి

1. అందు ( జూడాకర్ణు(డను పరి వ్రాజకుడు గలడు.

అక్కడ చూడాకర్ణుడు అనే పరివ్రాజకుడు ఉన్నాడు.

2.నీయంత వాడు కటకంబడి శపియింప దలంచునే?

నీ అంతటివాడు బాధపడి శపించాలని తలుస్తాడా?

3.ఇ(క నాకిక్కడ వసింపదగదు.

ఇంక నేను ఇక్కడ నివసించకూడదు.

4.గుణమింత కుదరక గుళ్ళు తిరుగుట యేల?

గుణం కొంచెం కూడా లేకుండా గుళ్ళు తిరగడం ఎందుకు?

5.వివేక హీనుడయిన ప్రభువును సేవించుట కంటె వనవాసము ఉత్తమము.

వివేకం లేని రాజును సేవించడం కంటే వనవాసం ఉత్తమం.

6.పురుషుడు న్యాయము తప్పక విద్యాధనములు గడింపవలెను.

పురుషుడు న్యాయాన్ని తప్పకుండా విద్యని,ధనాన్ని సంపాదించాలి.

7.తత్పురుష సమాసమునకే వ్యధికరణమని పేరు కలదు.

తత్పురుష సమాసానికే వ్యధికరణం అని పేరు ఉంది.

8.సంసార విషవృక్షమునకు రెండు ఫలము లమృత తుల్యములు.

సంసారం అనే విషవృక్షానికి రెండు ఫలాలు అమృత సమానాలు.

9.అతని వ్యాపారము న్యాయమార్గమున సాగుచున్నది.

అతని వ్యాపారం న్యాయమార్గంలో సాగుతోంది.

10.స్వాతంత్ర్యమనగా స్వరాజ్యమని మాత్రమే కాదు.

స్వాతంత్ర్యమంటే స్వరాజ్యం అని మాత్రమే కాదు.

11.మానవ జీవనము సుకుమారము.

మానవుని జీవితం సుకుమారం

12.నాకు దీని యుపద్రవము పెద్దదిగానున్నది.

నాకు దీని ఆపద ఎక్కువగా  ఉంది.

13.ఆ పరివ్రాజకుడు సెప్పగా విని మిక్కిలి ఖిన్నుడనయితిని.

ఆ సన్యాసి చెప్పగా విని చాలా బాధపడ్డాను.

14.ఎలుక ప్రతి దినము చిలుక కొయ్య మీదకెగిరి పాత్ర యందున్న యన్నము భక్షించిపోవుచున్నది.

ఎలుక ప్రతి దినము చిలుక కొయ్యమీదికి ఎగిరి పాత్రలో ఉన్న అన్నాన్ని తిని పోతోంది.

15.అనృత మాడుట కంటే మౌనము మేలు.

అబద్ధం ఆడడం కంటె మౌనం మేలు.

16.జీవనార్థము మిక్కిలి యాయాసం పాటు సయితము వ్యర్థము.

బ్రతకడం కోసం ఆయాసపడడం కూడా నిష్ఫలం.

17.సత్సంగతి కంటె లోకమందు మేలేదియు లేదు.

మంచివారితో స్నేహం (చేయడం) కంటే లోకంలో మేలైంది ఏదీలేదు.

18.జనులు కోరు జీవితము ఆడంబరము కాదు.

1.ప్రజలు కోరే జీవితం ఆడంబరంకాదు.

2.ప్రజలు కోరేది ఆడంబర జీవితం కాదు

19.పురిటిలోనే సంధి కొట్టింది నా చదువు.

మొదట్లోనే నా చదువు ఆగిపోయింది.

20.వనితా రత్నంబులీ భవ్య హైందవ భూజంగము పుణ్యదేవతలు.

స్త్రీలు శుభప్రదమైన ఈ హైందవ భూమిపై సంచరించే పుణ్యదేవతలు (లేదా)

రత్నాల వంటి స్త్రీలు ఈ శుభప్రదమైన భారత భూమిపై సంచరించే పుణ్యదేవతలు.

21.గుణమింత కుదరక గుళ్ళు తిరుగుట యేల?

గుణం కొంచెం కూడా లేకుండా గుళ్ళు తిరగడం ఎందుకు?

22.అందు( జూడాకర్ణు(డను పరివ్రాజకుడు గలడు.

అక్కడ చూడాకర్ణుడనే సన్యాసి ఉన్నాడు.

23. తడవుల బట్టి ఈ మొలుక విడువక వాసము చేయుచున్నది

చాలా కాలం నుండి ఈ ఎలుక వదలకుండా నివాసం చేస్తోంది

24. బుద్ధి హీనత వలన సమస్త కార్యముల నిదాఘునదీ పూరములట్లు వినాశము నొందును

బుద్ధి తక్కువ వల్ల కార్యాలన్నీ వేసవి కాలపు నదిలో నీళ్ళలా నశిస్తాయి

25. ధనమును బాసిన క్షణముననే లాతి వా( డగును

ధనం కోల్పోయిన వెంటనే పరుల ఆధీనమై పోతాడు

26. పరధనాపహరణము కంటె దిరియుట మంచిది

ఇతరుల ధనాన్ని దొంగిలించడం కంటె భిక్షమెత్తుకొనుట మంచిది

27. ఉదరమునకయు పరుల గోజక ప్రాప్త లాభమునకు సంతోషించు వా( డొక్కడు లోకమందు ధన్యుడు

పొట్టకోసం ఇతరులను పీడించక లభించిన లాభానికి సంతోషించే వాడే ఈ లోకంలో ధన్య జీవి

28. తడవుల ( బట్టి యీ యెలుక విడువక వాసము చేయుచున్నది

చాలాకాలం నుండి ఈ ఎలుక వదలకుండా నివాసం చేస్తోంది

29. ఈ యవసరంబున నిన్ను హెచ్చు గుందాడుట, మము బోటి గృహిణులకు మొచ్చుగాడు

ఈ సమయంలో నీతో వాదించడం మాలాంటి ఇల్లాళ్ళకు మంచిది కాదు

30. "మా యింటికిం గుడువ రమ్ము. కుడిచి కూర్చున్న పిమ్మట కొన్ని మాటలు నీతో నాడగలను

మా ఇంటికి భోజనానికి రా. తిని కూర్చున్నాక కొన్ని మాటలు నీతో మాట్లాడుతా

31. ఏ పాపాత్ముని ముఖంబు వీక్షింతిమో?

ఏ పాపాత్ముడి ముఖం చూశామో ?

32. నా వృత్తాంతము ఇతరులతో చెప్పికోలును యుక్తము గాదు

నా వృత్తాంతం ఇతరులకు చెప్పుకోవడం సరికాదు

33. జననీ ! హైందవ భూమి నీ పగిడి దుశ్చారిత్రముల్ సాగునే ?

తల్లి ! భరత భూమిలో ఇలాంటి దుశ్చరిత్రలు సాగుతాయా ?

34. మనలను మూవురను దైవ మొక్కచో జేర్చెను

మన ముగ్గురిని దైవం ఒక చోట చేర్చింది

35. అర్థములు నిత్యములు గావు. జీవనము బుద్బుద ప్రాయము

సంపదలు శాశ్వతాలు కావు. జీవితం (బ్రతుకు) బుడగ వంటిది

36. ఇంత యల్ప జంతువున కింత పొడవున కెగురు బలమెక్కడ నుండి వచ్చెను

ఇంత చిన్న జంతువుకి, ఇంత ఎత్తు ఎగిరే బలం ఎక్కడ నుంచి వచ్చింది ?

37. నీ యెడ దొసంగుల్లేమి భావించితిన్

నీలో తప్పులు లేక పోవడం గమనించా

38. శిలాంతరాళ మందలి కప్పను భరించు దయామయుడైన ఈశ్వరుండు నన్ను కాపాడుకుండునా?

రాతిలోని కప్పను భరించే దయగల ఈశ్వరుడు, నన్ను రక్షించకుండా ఉంటాడా ?

39. దేహికి దుఃఖములట్లు సుఖముల కోరకయే ప్రాప్తించు చున్నవి

దేహికి దుఃఖాలు లాగే, సుఖాలు కోరకుండానే ప్రాప్తిస్తాయి

40. ఇవ్వీటి మీద నా గ్రహము దగునె ?

ఈ పట్టణం మీద ఆగ్రహం తగునా ?

41. అర్థ పరహీనునకు నిరంతరము ఖేధము సంభవించును

డబ్బు లేని వాడికి నిత్యం దుఃఖం సంభవిస్తుంది

42. గుట్టుగ లక్ష్మి పొందు

రహస్యంగా లక్ష్మి చేరుతుంది

43. చిన్నయ సూరి బాల వ్యాకరణంబు రచించె.

చిన్నయ్య సూరి బాల వ్యాకరణాన్ని రచించాడు

44. పరధనాపహరణము కంటె దిరియుట మంచి.

ఇతరుల డబ్బును దొంగతనం చేయడం కంటే బిచ్చమెత్తుకొవడం మంచిది

45. సత్సంగంబు కంటె లోకమందుమేలేదియు లేదు

సజ్జనులతో సహవాసం కంటె లోకంలో మేలైనది ఏదీ లేదు

46. నీ కనులయందున్ దాల్మి సారింపుమీ

నీ కన్నుల్లో సహనం చూపించు

47. దీనికే మైనను నిమిత్తము లేక మానదు

దీనికి ఏమైనా కారణం లేకుండా ఉండదు

48. అసత్య మాడుట కంటె మౌనము మేలు

అసత్యం మాట్లాడడం కంటే మౌనంగా ఉండడం మేలు

49. మాతా ! తప్పు సైరింపుమీ

తల్లి ! తప్పును మన్నించు

50. కనని తల్లివిగా నిన్ను గౌరవించు

కనని తల్లిగా నిన్ను గౌరవిస్తాను

31. బీదముల కన్న వస్త్రముల పేర్మి కోసంగుము

పేదల (బీదల) కు అన్న వస్త్రాలను ప్రేమతో ఇవ్వండి

32. ఇక నాకిక్కడ వసింప దగదు

ఇంక నాకు ఇక్కడ నివసించడం తగింది కాదు

## కర్తరి - కర్మణి వాక్యాలు

1. ప్రతి వాళ్ళు ప్రశ్నించారు చరిత్ర సాగిన క్రమాన్ని

చరిత్ర సాగిన క్రమం ప్రతి వాళ్ళ చేత ప్రశ్నించబడింది

2. రేఖా మాత్రంగా నా భావాలను ఇక్కడ పొందుపరిచాను

రేఖా మాత్రంగా నా భావాలు ఇక్కడ పొందబరచబడ్డాయి

3. బూర్గుల వారు మంచి నిర్ణయాలు తీసుకున్నారు

మంచి నిర్ణయాలు బూర్గుల వారిచే తీసుకోబడ్డాయి.

4. కాళిదాసు రఘు వంశాన్ని రాశాడు

రఘు వంశం కాళిదాసుచే రచింపబడెను

5. ఆయన కొంతకాలం పర్షియన్ ట్యూటర్ పని చేశాడు

కొంతకాలం పర్షియన్ ట్యూటర్ గా ఆయన చేత పని చేయబడింది

6. రామకృష్ణా రావు ఆమోద ముద్ర వేశారు

ఆమోద ముద్ర రామకృష్ణ రావుచే వేయబడింది (లేదా)

రామకృష్ణా రావుచే ఆమోద్ర ముద్ర వేయబడింది

7. వీరి న్యాయవాద పటిమ ఇతరులను అబ్బుర పరచింది

వారి న్యాయవాద పటిమచే ఇతరులు అబ్బుర పరచబడ్డారు

8. గురువు గారు మంచి నిర్ణయాలు తీసుకున్నారు

మంచి నిర్ణయాలు గురువుగారిచే తీసుకోబడ్డాయి

9. ఆయన కన్ను మూసిన విషయం వ్రాశారు

కన్ను మూసిన విషయం ఆయనచే వ్రాయబడింది

10. నేను రాసిన కవిత్వం పత్రికలో ముద్రించారు

నాచే రాయబడిన కవిత్వం పత్రికలలో ముద్రింపబడింది

11. తెలుగులో కవిత్రయము మహా భారతమును రచించిరి

తెలుగులో కవిత్రయంచే మహా భారతం రచించబడింది

12. నాయకులు పిల్లలతో అరగంట కాలం గడిపారు

పిల్లలతో నాయకులచే అరగంట కాలం గడుపబడింది

13. వివిధ కవులు సుభాషితాలను రచించారు

సుభాషితాలు వివిధ కవులచే రచింపబడ్డాయి

14. పద్యం పూర్తికాక ముందే పై కప్పీలో ఇరుక్కున్న తీగను సవరించారు

పద్యం పూర్తి కాక ముందే పై కప్పీలో ఇరుక్కున్న తీగను సవరింపబడింది

15. వాల్మీకి రామాయణమును రచించెను

రామాయణం వాల్మీకి చే రచింపబడింది

16. వ్యాసుడు భారతాన్ని రచించాడు

భారతం వ్యాసునిచే రచింపబడింది

17. కవిత్రయం మహా భారతాన్ని అనువదించారు

మాహా భారతం కవిత్రయంచే అనువదించబడింది

18. ఎర్రన హరివంశాన్ని రచించాడు

హరివంశం ఎర్రనచే రచింపబడింది

## <u>ప్రత్యక్ష కథనం - పరోక్ష కథనం</u>

1. "నేను, నా పేరు, మావూరు అంతా ఒకటే" అని రామగిరి చెప్పాడు

తాను, తన పేరు, తన ఊరు అంతా ఒకటేనని రామగిరి చెప్పాడు

2. "నేను కూడా ఆలోచనలో పడ్డాను, నిజమే కదా" అని రచయిత అనుకున్నాడు

తాను కూడా ఆలోచనలో పడ్డానని, నిజమే కదాని రచయిత అనుకునాడు

3. "నాతో ఇన్ని బేరాలు లేవు " అని రచయిత అన్నాడు

తనతో ఇన్ని బేరాలు లేవని రచయిత అన్నాడు

4. "నేను రామాయణం చదివాను. నాకెంతో నచ్చింది" అని సురేష్ అన్నాడు

తాను రామాయణం చదివానని, తనకెంతో నచ్చిందనీ సురేష్ అన్నాడు

5. " నాకు ఈ రోజు ఆరోగ్యం బాగా లేదు " అని రవి చెప్పాడు

తనకు ఈ రోజు ఆరోగ్యం బాగా లేదని రవి చేప్పాడు

6. " నా రచనలలో నా జీవితం ఉంటుంది " అని రచయిత అన్నాడు

తన రచనలలో తన జీవితం ఉంటుందని రచయిత అన్నాడు

7. " నేను నేటి సినిమాలను చూడలేకపోతున్నాను " అని అమ్మతో అన్నాను

తాను నేటి సినిమాలను చూడలేకపోతున్నానని అమ్మతో అన్నాను

8. "నీకివ్వాల్సింది ఏమీ లేదు" అని అతను నాతో అన్నాడు

మాకివ్వాల్సింది ఏమీ లేదు అని నాతో అతడన్నాడు

9. "ప్రజ్ఞ పద్యాలు బాగా పాడింది" అని అందరు అనుకుంటున్నారు

ప్రజ్ఞ పద్యాలు బాగా పాడిందని అందరనుకుంటున్నారు

10. " భాను ప్రకాష్ ఊరికి వెళ్ళాడు" అని వాళ్ళమ్మ చెప్పింది

భాను ప్రకాష్ ఊరికెళ్ళాడని వాళ్ళమ్మ చెప్పింది

11. ఉపాధ్యాయుడు "సుందరకాండ చదువు" అని నాకు చెప్పాడు

సుందరకాండ చదవమని నాకు ఉపాధ్యాయుడు చెప్పాడు

12. "నాకు కోపం ఎక్కువ. ప్రేమ కూడ ఎక్కువే" అని రాజు రవితో అన్నాడు

తనకు కోపం ఎక్కువని ప్రేమ కూడా ఎక్కువేనని రాజు రవితో అన్నాడు

13. "మీరు చాలా మందికి ఉపకారాలు చేశారు. నాకీ ఉపకారం చేసిపెట్టండి"అని రామగిరి దాసుతో అన్నాడు

తమరు చాలా మందికి ఉపకారాలు చేశారనీ, తనకా ఉపకారం చేసిపెట్టండని రామగిరి దాసుతో అన్నాడు

14. "నాకు పదివేలు అప్పు ఉన్నది. అది తీరుస్తారా?" అని దాసు రామగిరిని అడిగాడు

తనకు పదివేలు అప్పు ఉన్నదనీ, అది తీరుస్తారా అని దాసు రామగిరిని అడిగాడు

15. "నా పుస్తకాలు, కాగితాలు ఏవి ? ఎవరు తీశారు ? " అంటూ అంబేద్కర్ కేకలు వేసేవాడు

తన పుస్తకాలు, కాగితాలు ఏవనీ, ఎవరు తీశారనీ అంటు అంబేద్కర్ కేకలు వేసేవాడు

16. "నన్ను గూర్చి ఒక పుస్తకం రాయి. నా పెళ్ళాం బిడ్డలు కూడా మనుషులల్లే ఉంటారు" అని రామగిరి దాసుకు చెప్పాడు

తన్ను గూర్చి ఒక పుస్తకం రాయమని, తన పెళ్ళాం బిడ్డలు కూడా మనుష్షులల్లే ఉంటారని రామగిరి దాసుకు చెప్పాడు

17. "నా తప్పును క్షమించు" అని శివాజీ వేడుకున్నాడు

తన తప్పుని క్షమించు మని శివాజీ వేడుకున్నాడు

18. "నా ఆజ్ఞ తప్పక పాటించాలి" అని శివాజీ హెచ్చరించాడు

తన ఆజ్ఞను తప్పక పాటించాలని శివాజీ హెచ్చరించాడు

19. "నాకు రామకృష్ణారావు ప్రాతః స్మరణీయులు" అని పి.వి. గారు అన్నాడు

తనకు రామకృష్ణారావు ప్రాతః స్మరణీయులని పి.వి. గారు అన్నాడు

# జాతీయాలను వివరించుట

1. శ్రీరామ రక్ష = ఎల్లప్పుడూ రక్షించడం, చక్కగా రక్షింప గలిగినది, సర్వ రక్షకం

   ఉదా :- 'ఎల్లప్పుడూ రక్షించడం' అనే అర్థంలో ఈ జాతీయాన్ని వాడతారు

2. కాలక్షేపం = 'వృథాగా కాలం గడపడం' అనే అర్థంలో ఈ జాతీయాన్ని వాడతారు

   ఉదా :- 'వృథాగా కాలం గడపడం' అనే అర్థంలో ఈ జాతీయాన్ని వాడతారు

3. గుండెలు బరువెక్కడం = మిక్కిలి బాధతో ఉండటం

4. పురిటిలోనే సంధి కొట్టదం = పురిటి రోజుల్లోనే బిడ్డ మరణించడం (లేదా) పని మొదలు పెట్టగానే ఆ పనికి అడ్డంకి ఏర్పడి పని పాడవడం

5. కలుపు దీయడం = 'చెడుని ఏరిపేయడం' అనే అర్థంలో వాడతారు

6. గ్రామోద్ధరణం = గ్రామాన్ని బాగు చేయడం

7. ఉన్నదంతా ఊడ్చుకపోవడం = ఏమీ మిగలకుండా తీసుకు పోవడం (లేదా) పూర్తిగా నాశనం కావడం

8. గీటురాయి = 'కొలమానం', 'ప్రమాణం', 'స్వచ్ఛతను తెలిపేది' అనే అర్థంలో వాడతారు

9. రూపుమాపడం = 'ఆకారం లేకుండా చేయడం', 'నశింపచేయడం', 'రూపరేఖలు లేకుండా చేయడం'

10. కారాలు మిరియాలు నూరడం = 'కోపంతో మండిపడడం', 'కోపగించడం' అనే అర్థంతో వాడతారు

11. స్వస్తి వాచకం = ముగింపు చెప్పడం, విరమించడం, పూర్తి చేయుట

12. నీరు కారి పోవడం = నిరుత్సాహపడడం,నీరసించిపోవడం

14. కాలధర్మం చెందడం = మరణించడం, చనిపోవడం

15. తునాతునకలు = ముక్కలు ముక్కలు కావడం,భగ్నం కావడం, నాశనం కావడం

16. చిందులు వేయడం = కోపంతో అరుస్తూ గంతులు వెయ్యడం

17. మూణ్ణాళ్ళా ముచ్చట = కొద్దికాలం ఉండే ఆనందం

18. భగీరథ ప్రయత్నం = ఎక్కువ కష్టపడి సాధించడం, తీవ్ర ప్రయత్నం చేయడం

19. నిమ్మకు నీరెత్తినట్లు = ఏమీ పట్టనట్లు ఉండడం, నిరాసక్తత చూపడం

20. పుస్తకాల పురుగు = ఎక్కువగా చదవడం, మితిమీరి చదివేవారు

21. మంత్రాలకు చింతకాయలు రాలడం = సంబంధం లేదని చెప్పడానికి ఈ జాతీయాన్ని వాడతారు

22. అగ్ర తాంబూలం = ముందుగా గౌరవించడం

23. ఉలుకూ పలుకూ లేకపోవడం = స్పందించక పోవడం(లేదా)మాట్లాడక పోవడం

24. మిన్నందుకోవడం = అసాధ్యాన్ని సాధించిన సందర్భంలో ప్రయోగిస్తారు

25. గజ్జె కట్టడం = పని ఆరంభించడం

26. దిక్కులు పిక్కటిల్లడం = "పెద్ద ధ్వని అంతటా వ్యాపించడం"అనే అర్థంలో ఈ జాతీయాన్ని వాడతారు

28. డబ్బు గుంజడం = 'అన్యాయంగాను, అక్రమంగాను ఎదుటివారి నుండి డబ్బులను తీసుకోవటం' అనే అర్థంలో వాడతారు

29. కనువిప్పు = జ్ఞానోదయం కావడం; (లేదా)'ఏదైనా విషయాన్ని తెలుసుకోవడం ద్వారా అజ్ఞానం పోయి సత్యం తెలిసికోవడం

30. ఆరు నూరైనా = 'అసాధ్యం' (లేదా) ఎన్ని రకాలుగా ప్రయత్నించినా చేపట్టిన కార్యం నెరవేరదని తెలియజేయు సందర్భంలో ఈ జాతీయాన్ని వాడతారు

31. ఇంటిల్లిపాది = 'ఇంట్లో ఉన్నవారంతా' అని అర్థంలో వాడతారు

32. సామాజికాభివృద్ధి = సమాజం అంటే మన ఉండే ప్రజాసమూహం ఆ ప్రజల అభివృద్ధియే సామాజికాభివృద్ధి.

33. విజయవంతం కావడం = 'తలపెట్టిన లేదా ప్రారంభించిన పని జయప్రదంగా పూర్తి అవడం' అనే అర్థంలో వాడతారు.

## II జాతీయాలను సొంత వాక్యాలలో ప్రయోగించుట

1. శ్రీరామ రక్ష = అపాయం లేనిది, పరిరక్షించగలిగినది.
   ప్రతి వ్యక్తి ఉన్నత భవిష్యత్తుకి క్రమశిక్షణే శ్రీరామరక్ష.

2. గీటు రాయి= కొలబద్ద, ప్రమాణం, నాణ్యతను తెల్పే సాధనం.
   వ్యక్తి యొక్క మంచి లక్షణాలే ఆ వ్యక్తి యొక్క వ్యక్తిత్వానికి గీటురాయి.
   రాజు బుద్ధిమంతుడు అనడానికి అతడు సాధించిన విజయాలే గీటురాయి.

3. కారాలు మిరియాలు నూరడం = మండిపడడం, మిక్కిలి కోపగించడం.
   మంత్రిగారు, తనమాట వినలేదని నాపై కారాలు మిరియాలు నూరుతున్నారు.

4. రూపు మాపడం= ఆకారం లేకుండా చేయడం,నశింపచేయడం
   సంఘ సంస్కర్తలు సమాజంలోని మూఢ నమ్మకాలను రూపుమాపారు.

5. ధర్మవిధి = ధర్మాన్ని అనుసరించడం.
   తల్లి తండ్రులను ఆదరించడం మన ధర్మవిధి.

6. ఊపిరాడని = తీరికలేని.
   నగరంలో ఊపిరాడనన్ని పనులున్నాయి.

7. చివాట్లు పెట్టడం = తప్పు చెసినందుకు నిందించడం.
   చెప్పినపని చేయలేదని మా అమ్మ నన్ను చివాట్లు పెట్టింది

8. మాట మీద నిలబడడం = ఇచ్చిన మాట నెరవేర్చుకొనడం
   చిన్ననాటినుండి అన్నమాట తప్పకుండ మాట మీద నిలవడం అలవాటు చేసుకోవాలి.

9. గుండెలు బరువెక్కడం = మిక్కిలి బాధతో ఉండడం.
   జయలలిత మరణంతో తమిలనాట ప్రజల గుండెలు బరువెక్కాయి.

10. కనువిప్పు = జ్ఞానోదయం, తెలివివచ్చు
    గురువు గారి హిత బోధతో మాకు కనువిప్పు కలిగింది.

11. శ్రద్ధాసక్తులు = ఆసక్తి.
    మనం చేసే పని మీద శ్రద్ధాసక్తులు ఉంటేసే విజయం సాదించగలం.

12. కుందాడుట = బాధ పెట్టుట.

తగిన కారణం లేకుండా ఎవరినీ కుందాడుట మంచిదికాదు.

13. నీరు కారిపోవడం = నిరుత్సాహపడడం, దిగాలు పడిపోవడం.

డబ్బులు లేకపోవడంతో ఉన్నత విద్యలు చదువుకోవాలనే నా కోరికలు నీరుకారిపోయాయి.

14. అహర్నిశం = ఎల్లప్పుడు

రైతులు అహర్నిశలు కష్టపడినా ఫలితం అంతంత మాత్రంగానే ఉంటోంది.

15. కాలక్షేపం = కాలం వృధాగా గడపడం

రైతులు పనులు లేక రచ్చబండల మీద కాలక్షేపం చేస్తున్నారు.

16. గుండెలు బరువెక్కడం = మిక్కిలి బాధతో ఉండడం.

గాంధీజీ మరణించినపుడు భారతీయుల గుండెలు బరువెక్కాయి.

17. అగ్రతాంబులం = ముందుగా గౌరవించడం

ఉద్యోగాలలో తెలివిగలవారికే అగ్రతాంబులం దక్కుతుంది

18. చమత్కారం = నేర్పు

మా తెలుగు ఉపాధ్యాయుడు ప్రతి మాట చమత్కారంగా మాట్లాడతారు

19. గజ్జెకట్టడం = ప్రారంభించడం

వార్షికోత్సవం నాడు నా సోదరి భరతనాట్యాని కి గజ్జెకట్టడం జరిగింది

20. మూణ్ణాళ్ళ ముచ్చట = కొంతకాలం ఉండే ఆనందం

కమలమ్మ దాంపత్యం జీవితం మూణ్ణాళ్ళ ముచ్చటగా మారింది

21. ప్రేమ ఆప్యాయతలు = తల్లిదండ్రులు పిల్లలను ప్రేమాప్యాయతలతో పెంచుతారు

22. భగీరథ ప్రయత్నం = మిక్కిలి కృషి

నవ్యాంధ్ర రాజధాని నిర్మాణం కోసం చంద్రబాబు నాయుడు గారు భగీరథ ప్రయత్నం చేస్తున్నాడు

23. నిమ్మకు నీరెత్తినట్లు = ఏమి పట్టనట్లు ఉండడం నిరాసక్తత

అధికారులు మార్కెట్లో కల్తీ పాలను అరికట్టలేక నిమ్మకు నీరెత్తి నట్లుగా ఉన్నారు

24. వన్నె చిన్నలు = పక్షుల వన్నె చిన్నెలు ఎంతో ఆనందాన్ని కలిగిస్తాయి

25. పఠనీయ గ్రంథాలు = చదవదగిన పుస్తకాలు

రామాయణ భారతాలు మన పఠనీయ గ్రంథాలు

26. పుస్తకాల పురుగు = అమితంగా చదివేవారు

కమల పబ్లిక్ పరీక్షలకు పుస్తకాల పురుగై చదువుతోంది

27. అలుగులు వారు = అధికంగా ప్రవహించడం, కన్నీరు కారు

సీతను పొగొట్టుకున్న రాముడు కన్నీరు అలుగులు వారగా ఏడ్చాడు

28. మంత్రాలకు చింతకాయలు రాలడం = మంత్రాలకు చింతకాయలు రాలుతాయని కొందరు మూఢనమ్మకస్తులు భావిస్తారు

29. కాలధర్మం చెందడం = మరణం

వివేకానందుడు అతి చిన్న వయసులోనే కాలధర్మం చెందాడు

30. మచ్చెకంటి = చక్కని ఆడది

తెలుగు సినీ నటులలో శ్రీదేవి చక్కని మచ్చెకంటి

31. ద్వాఃకవాటము = ద్వారము తలుపు

ద్వాఃకవాటం లేకపోతే దొంగలు ఇంటిని దోచుకుంటారు

32. అంగన = స్త్రీ

స్త్రీలను గౌరవించడం మన సంప్రదాయం

33. వీక్షించు = చూచు

పరీక్షల కాలంలో విద్యార్థులు టీవీని తక్కువగా వీక్షించాలి

34. సమయ సందర్భాలు = అనాలోచితం

సమయ సందర్భాలు లేకుండా ఇతరులతో హాస్యం ఆడరాదు

35. ఆరునూరైనా = ఏది ఏమైనా

ఆరునూరైనా నేను పదవతరగతిలో 10 గ్రేడు సాధిస్తాను

36. పొద్దస్తమానం = పగలంతా

నా తమ్ముడు పొద్దస్తమానం కష్టపడి పని చేస్తాడు

37. సాన్నిధ్యం = సామీప్యం,ఎదురు

దేవుని సాన్నిధ్యంలో అందరూ సమానులే

38. కష్టఫలం = శ్రమకు ఫలితం

అతివృష్టి వల్ల పంటలు పాడయి రైతులకు కష్టఫలం దక్కలేదు

39. కడుపులు మాడ్చుకోను = పస్తులుండడం

తల్లిదండ్రులు వారి కడుపులు మాడ్చుకొని తమ పిల్లలకు చదువు చెప్పిస్తున్నారు

40. అడుగున పడిపోవు = కనిపించకుండా పోవు

కలెక్టరు గారికి నేను ఇచ్చిన అర్జీ, అడుగున పడిపోవడం జరిగింది

పాశ్చాత్య పోకడలు రావడంతో, ప్రాచీన సంప్రదాయాలు అడుగున పడిపోయాయి.

41. రోమాంచితం = గగుర్పాటుకి లోనుకావడం

తానెంతగానో అభిమానించే గురువుగారు, హఠాత్తుగా కనిపించగానే, శివయ్య మేను ఆనందంతో రోమాంచితమైంది

42. తోడ్తెచ్చు = వెంట తీసుకురావడం

రాధ తన స్నేహితురాలికెదురేగి తోడ్తెచ్చింది

43. తునాతునకలు = ముక్కలవడం, భగ్నం

అద్దం కిందపడి తునాతునకలైంది

44. హాయి సౌఖ్యాలు = తల్లిదండ్రులు బిడ్డలు హాయి సౌఖ్యాల గురించి శ్రద్ధ పెట్టాలి

45. బుధుడు = పండితుడు

బుధులతో కలిసి ఉండడం వల్ల జ్ఞానం పెరుగుతుంది

46. అనయం = ఎల్లప్పుడు

అనయం మంచిమాటలనే మాట్లాడుతుండాలి

47. శమం = శాంతి

ఋషులు శమం, దమం కలిగియుంటారు

48. మైత్రి = స్నేహం

సజ్జనులతోనే మైత్రి చేయాలి

49. సౌజన్యం = మంచితనం

సత్యసాయి బాబా గారి సౌజన్యంతో ఎంతో మందికి త్రాగు నీరు లభిస్తోంది

50. ఏకాకి = ఒంటరి

అభిమన్యుడు పద్మవ్యూహంలో ఏకాకి అయినాడు

51. నగారా = పెద్దఢంకా, భేరి

మంత్రి గారు నగారా మోగించి 'చెట్టు - నీరు' పథకాన్ని ప్రారంభించారు

52. హోరు = తీవ్రమైన ధ్వనికి అనుకరణ (గాలి వీచడం, వానకురవడం)

సముద్ర కెరటాల హోరు అమావాస్యనాడు ఎక్కువగా ఉంటుంది

53. ఘోష = ఉరుము, పెద్ద శబ్దం

ప్రభుత్వము సామన్య జనుల జీవన ఘోషను వినిపించుకోవాలి

54. ఊపిరాడని = గాలి పిల్చుకోవడానికి వీలుకాని.

మంత్రికి కార్యాలయంలో ఊపిరాడని పనులు ఉనాయి

55. సిఫార్సు = మాట సహాయం చేయడం

ఈరోజుల్లో సిఫార్సు లేకుండా కార్యాలయాల్లో చిన్న ఫైలుకూడ ముందుకు కదలదు

56. డబ్బు గుంజడం = లంచం తీసుకోవడం

ప్రభుత్వ కార్యాలయాల్లో గుమస్తాలు ఏదో వంక పెట్టి డబ్బు గుంజడం మొదలు పెట్టారు

57. మాట మీద నిలబడడం = చెప్పిన (ఇచ్చిన) మాటకు కట్టుబడి ఉండడం

నిజాయితో పరులు మాటమీద నిలబడతారు

58. తూనాతునకలు = ముక్కలు ముక్కలు కావడం

బాంబు దాడికి కారు తునాతునకలు అయ్యింది

59. శ్రీరామ రక్ష = చక్కగా రక్షింపదగినగి

దూర దృష్టి గల నెహ్రూజీ మనదేశానికి మొదట ప్రదాని మంత్రి కావడం మనకు శ్రీరామ రక్ష

# వ్యతిరేక వాక్యాలు

| | |
|---|---|
| 1. నాకు క్రికెట్ ఆడటం చాలా ఇష్టం<br>నాకు క్రికెట్ ఆడటం చాలా ఇష్టం కాదు<br>2. సిటీ అంటే అన్నీ బ్యూటీ బిల్డింగ్ లు కావు<br>సిటీ అంటే అన్నీ బ్యూటీ బిల్డింగ్ లు అవును<br>3. నాకు కాఫీ త్రాగడం ఎక్కువ ఇష్టం<br>నాకు కాఫీ త్రాగడం ఎక్కువ ఇష్టం కాదు<br>4. వాడు రేపు రావచ్చును<br>వాడు రేపు రాకపోవచ్చును<br>5. లక్ష్మి బాయి శారదానికేతనంలో చేరలేదు<br>లక్ష్మీబాయి శారదా నికేతనంలో చేరింది<br>6. సప్తాహాల వల్ల సమస్యలు పరిష్కారం కావు<br>సప్తాహాల వల్ల సమస్యలు పరిష్కారం అవుతాయి<br>7. నీవు ఇంటర్మీడియట్ కూడా ప్యాస్ కాలేదుగా<br>నీవు ఇంటర్మీడియట్ కూడా ప్యాస్ అయ్యావుగా<br>8. నీకన్నం పెట్టిన ఫలితం కూడా లేదు<br>నీకన్నం పెట్టిన ఫలితం కూడా ఉంది<br>9. నిన్న జోరుగా వర్షం కురిసింది<br>నిన్న జోరుగా వర్షం కురవలేదు<br>10. నాకు రేపు మద్రాసు ప్రయాణం ఉండకపోవచ్చు<br>నాకు రేపు మద్రాసు ప్రయాణం ఉండవచ్చు<br>11. నాకు ఆటలంటే ఇష్టం<br>నాకు ఆటలంటే ఇష్టం లేదు<br>12. కపిల్ టెన్నిస్ ఆడుట లేదు<br>కపిల్ టెన్నిస్ ఆడుతున్నాడు<br>13. రాజకీయ వేత్తలలో మేధావులున్నారు .<br>రాజకియ వేత్తలలో మేత్తలతో మెధావులు లేరు | 14. పిల్లలకు ఇష్టమైన పదార్థాలు కొన్ని ఉంటాయి<br>పిల్లలకు ఇష్టమైన పదార్థాలు ఉండవు<br>15. భారత క్రికెట్ జట్టు ప్రపంచ కప్పు గెల్చుకుంది<br>భారత క్రికెట్ జట్టు ప్రపంచ కప్పు గెల్చుకోలేదు<br>16. ప్రభుత్వానికి డాలర్లు అవసరం<br>ప్రభుత్వానికి డాలర్లు అవసరం లేదు<br>17. వర్షము కుండపోతగా కురియు చున్నది<br>వర్షము కుండపోతగా కురియుట లేదు<br>18. రాజకీయ నాయకులంతా గొప్పవాళ్ళు<br>రాజకీయ నాయకులంతా గొప్పవాళ్ళు కాదు<br>19. పావనికి రోజాలంటే ఇష్టం<br>పావనికి రోజాలంటే ఇష్టం లేదు<br>20. నాట్యగత్తెల వేషాలు పురుషులు ధరించారు<br>నాట్యగత్తెల వేషాలు పురుషులు ధరించ లేదు<br>21. ఆమె చెడు మాటలు వినదు<br>ఆమె చెడు మాటలు వింటుంది<br>22. కృష్ణ ఉద్యోగం చేస్తున్నాడు<br>కృష్ణ ఉద్యోగం చేయుట లేదు<br>23. అందరూ కలిసి వెళ్తున్నారు<br>అందరూ కలిసి వెళ్ళడం లేదు<br>24. వాడు రేపు రావచ్చు<br>వాడు రేపు రాక పోవచ్చు<br>25. వర్తకులు ఓడలలో ప్రయాణ మౌతారు<br>వర్తకులు ఓడలలో ప్రయాణం కారు<br>26. చెత్త కుండీలను ఏర్పాటు చేశారు<br>చెత్త కుండీలను ఏర్పాటు చేయలేదు |

# వాక్యం

## క్రింది సామాన్య వాక్యాలను సంయుక్త వాక్యాలుగా మార్చండి

1. వర్షం వచ్చింది. చెరువు నిండలేదు (సామాన్య వాక్యం)

వర్షం వచ్చింది కాని చెరువు నిండలేదు (సంయుక్త వాక్యం)

2. రామకృష్ణుడు గురువు. వివేకానందుడు శిష్యుడు (సామాన్య వాక్యం)

రామకృష్ణుడూ, వివేకానందుడూ గురుశిష్యులు (సంయుక్త వాక్యం)

3. సీత సంగీతం నేర్చుకుంటున్నది . సీత నృత్యం నేర్చుకుంటున్నది (సామాన్య వాక్యం)

సీత సంగీతం, నృత్యం నేర్చుకుంటున్నది (సంయుక్త వాక్యం)

4. రంగారావుకు పాడమంటే ఆసక్తి. రంగారావుకు వినడమంటే విరక్తి (సామాన్య వాక్యం)

రంగారావుకు పాడమంటే ఆసక్తి, వినడమంటే విరక్తి (సంయుక్త వాక్యం)

5. శ్రీను బడికి వచ్చాడు. జాన్ రెడ్డి బడికి వచ్చాడు. హస్మత్ బడికి వచ్చాడు (సామాన్య వాక్యం)

శ్రీను, జాన్ రెడ్డి, హస్మత్ బడికి వచ్చాడు (సంయుక్త వాక్యం)

6. ఆయన కవి. ఆయన గాయకుడు. ఆయన విద్యావేత్త . (సామాన్య వాక్యం)

ఆయన కవి, గాయకుడూ, విద్యావేత్త (సంయుక్త వాక్యం)

7. డాll రామకృష్ణా రావు గారు ముట్టని, పెంపొందించని క్షేత్రం ఏదిలేదు (సంయుక్త వాక్యం)

8. పంటను ఎలుకలు, చీమలు తినకుండా జాగ్రత్త చేసుకోవాలి (సంయుక్త వాక్యం)

9. తాత భారతం చదివి, నిద్ర పోయాడు ( సంశ్లిష్ట వాక్యం )

10. మా టీచర్ కు నా పై ఎనలేని ప్రేమ, సాను భూతి ఉండేది (సంయుక్త వాక్యం)

11. పిల్లలు సముద్ర తీరాన ఆడుతూ , ఇళ్ళు కట్టుకున్నారు ? (సంశ్లిష్ట వాక్యం)

12. ఈ సంవత్సరము వర్షములు పడినవి కాని పంటలు పండలేదు (సంయుక్త వాక్యం)

13. అశ్విని, జ్యోతి, సరళ అక్కా చెల్లెండ్రు (సంయుక్త వాక్యం)

14. సితక్క పెండ్లికి ఏర్పాటు చేశారు కానీ పెండ్లి పెటాకులయ్యింది (సంయుక్త వాక్యం)

15. మీరు చూడని, వినని పుణ్యక్షేత్రం ఈ దేశంలో లేదు (సంయుక్త వాక్యం)

16. అతడు ఎప్పుడూ, పాడుతూ, గెంతుతూ ఉంటాడు (సంశ్లిష్ట వాక్యం)

17. ఆయన క్రియా శీలీ, ధైర్యశాలి (సంయుక్త వాక్యం)

18. ఆమె చక్కగా పాడింది. బహుమతి గెలుచుకుంది (సామాన్య వాక్యాలు)

19. అమ్మకూర తరుగుతున్నది. అమ్మ దోసె చేస్తున్నది (సామాన్య వాక్యాలు)

20. రాము పాఠం చదివాడు. రాము పాఠం అర్థం చేసుకున్నాడు (సామాన్య వాక్యాలు)

రాము పాఠం చదివి అర్థం చేసుకున్నాడు (సంశ్లిష్ట వాక్యం)

21. వైద్యుడు ప్రథమ చికిత్స చేస్తాడు. వైద్యుడు మందులు ఇస్తాడు (సామాన్య వాక్యాలు)

వైద్యుడు ప్రథమ చికిత్స చేసి మందులు ఇస్తాడు (సంశ్లిష్ట వాక్యం)

22. అక్క టీవీ చూస్తున్నది. అక్క నృత్యం చేస్తున్నది (సామాన్య వాక్యాలు)

అక్క టీవీ చూస్తూ నృత్యం చేస్తున్నది (సంశ్లిష్ట వాక్యం)

23. గులాబీ, మల్లె మొక్కలు పూశాయి (సంయుక్త వాక్యం)

24. వర్షం పడుతూండటం వలన బట్టలు తడిశాయి (సంయుక్త వాక్యం)

25. రామకృష్ణుడు గురువు. వివేకానందుడు శిష్యుడు (సామాన్య వాక్యాలు)

26. సీత ఊరికి వెళ్ళి మరునాడు తిరిగి వచ్చింది (సంశ్లిష్ట వాక్యం)

27. అమ్మ, అక్క, వదిన వచ్చారు (సంయుక్త వాక్యం)

28. రమ భాగా చదివి పరిక్షలో ఉత్తీర్ణురాలయింది (సంశ్లిష్ట వాక్యం)

29. తండ్రి పక్షి చిత్ర గ్రీవాన్ని క్రిందికి తోసేసింది కాని చిత్ర గ్రీవం పడిపోకుండా జాగ్రత్త పడింది (సంయుక్త వాక్యం)

30. అక్కడ బురదగా ఉంది కాబట్టి జాగ్రత్తగా చూసుకొని నడు (సంయుక్త వాక్యం)

# అసమాపక క్రియా వాక్యాలు

పనులను తెలియజేసే పదాలను 'క్రియలు' అంటారు. క్రియ రెండు రకాలు

అవి. **1. సమాపక క్రియ**

**2. అసమాపక క్రియ**

**1. సమాపక క్రియ** : పని పూర్తి అయిన క్రియను 'సమాపక క్రియ' అంటారు

ఉదా :- చదివెను, రాసెను, వచ్చెను, చేసెను మొllనవి

**2. అసమాపక క్రియ** : పని పూర్తి కాని క్రియను 'అసమాపక క్రియ' అంటారు

ఉదా :- చదివి, రాసి, వచ్చి, చేసి మొllనవి.

అసమాపక క్రియ నాలుగు రకాలు. అవి

**1. క్త్వార్థకం** **2. శత్రర్థకం**

**3. ఛేదర్థకం** **4. అప్యర్థకం**

**1. క్త్వార్థకం** : భూత కాలిక అసమాపక క్రియను ' . క్త్వార్థకం' అంటారు

ఇది ధాతువు (క్రియ) కు 'ఇ' అనే ప్రత్యయం చేర్చడం వల్ల ఏర్పడుతుంది

క్త్వార్థక క్రియా రూపాలు : వచ్చి, ఇచ్చి, తిని, చేసి, చూసి, వెళ్ళి మొllనవి

ఉదా :- 1. గాయత్రి పాఠమును చదివి నిద్రపోయెను

2. రాముడు వచ్చి రావణుని చంపెను

**2. శత్రర్థకం** :- వర్తమాన కాల అసమాపక క్రియను సూచించే పదాలను ;శత్రర్థకం' అంటారు. క్రియకు 'తూ' అనే ప్రత్యయం . చేరడం వల్ల శత్రర్థక రూపాలు ఏర్పడుతాయి

శత్రర్థక క్రియా రూపాలు : వస్తూ, ఇస్తూ, చెప్తూ, చూస్తూ, మొllనవి

ఉదా :- 1. కమల వంట చేస్తూ పాటలు వింటోంది

2. మంజుల మెట్లు దిగుతూ దిక్కులు చూస్తున్నది

**3. చేదర్థకం** :- 'జరిగినపుడు' అనే అర్థం ఇచ్చే అసమాపక క్రియా రూపాలను 'ఛేదర్థకం' అంటారు. ధాతువు (క్రియా) కు 'తే', 'ఐతే' ప్రత్యయాలు చేరడం వల్ల ఈ రూపాలు ఏర్పడుతాయి

ఛేదర్థక క్రియా రూపాలు : వస్తే, చేస్తే, పోతే, చెప్తే, వచ్చినట్లైతే, చెప్పినట్లైతే, పోయినట్లైతే మొIIనవి

ఉదా :- 1. వానలు కురిస్తే పంటలు పండుతాయి

2. రైలు వస్తే బంధువులు వస్తారు

**4. అప్యర్థకం** :- 'జరిగినప్పటికి' అనే అర్థం వచ్చే అసమాపక క్రియా పదాలను 'అప్యర్థకం' అంటారు. దీన్నే 'తుమున్నర్థకం' అని కూడా అంటారు.

ఇవి ధాతువు (క్రియా) కు 'ఇనా' ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడుతాయి అనగా ఒక పనికి నిమిత్తమైనా మరియొక్క పనిని క్రియా

రూపం 'తుమున్నర్థకం' అంటారు

అప్యర్థక క్రియా రూపాలు : చెప్పినా, చేసినా, తినినా, చదివినా మొIIనవి

ఉదా :- 1. ఎన్ని చట్టాలు చేసినా అవినీతి తగ్గలేదు

2. వర్షం కురిసినా పంటలు పండలేదు

| క్రమ సంఖ్య | వాక్యం | అర్థం | ప్రత్యయం |
|---|---|---|---|
| 1. | క్త్వార్థకం | ఇది భూతకాలిక అసమాపక క్రియను సూచుస్తుంది | క్రియలో 'ఇ' అనే ప్రత్యయం ఉంటుంది |
| 2. | శత్రర్థకం | ఇది వర్తమాన కాలంలో ఉండే అసమాపక క్రియను సూచిస్తుంది | క్రియలో 'తూ' అనే ప్రత్యయం ఉంటుంది |
| 3. | ఛేదర్థకం | 'జరిగినపుడు' అనే అర్థాన్ని సూచించే అసమాపక క్రియా | క్రియలో 'తే' 'ఐతే' అనే ప్రత్యయం ఉంటుంది |
| 4. | అప్యర్థకం | 'జరిగినప్పటికీ' అనే అర్థాన్ని సూచించే అసమాపక క్రియా | క్రియలో 'ఇనా' అనే ప్రత్యయం ఉంటుంది |

# అసమాపక క్రియా వాక్యాలు లేదా సంశ్లిష్ట వాక్యాలు

| | |
|---|---|
| 1. వర్షాలు కురిస్తే పంటలు పండుతాయి<br>చేదర్థక వాక్యం<br>2. బాగా ఆడినా గెలవ లేదు<br>అప్యర్థక వాక్యం<br>3. మాధవి ఆలోచిస్తూ పుస్తకం చదువుతోంది<br>శత్రర్థక వాక్యం<br>4. నీవు వచ్చినా వాడు రాడు<br>అప్యర్థకం<br>5. సీత పాట పాడుతూ నడుస్తోంది<br>శత్రర్థ వాక్యం<br>6. నేను నెగ్గితే దేవాలయం కట్టిస్తాను<br>ఛేదర్థకం | 7. చెట్లు పూత పూస్తే కాయలు కాస్తాయి<br>ఛేదర్థక వాక్యం<br>8. వర్షాలు కురిసినా నీళ్ళు నిలవవు<br>అప్యర్థకం<br>9. వారు నెమ్మదిగా నచ్చ చెప్తూ చాలా సేపు వినేవారు<br>శత్రర్థకం<br>10. నీవు బాగా చదివినా పరీక్షలో తప్పావు<br>అప్యర్థక వాక్యం<br>11. వర్షాలు వస్తే చెరువులు నిండుతాయి<br>ఛేదర్థక వాక్యం |

## వాక్య భేదాలు ( ఈ క్రింది వాక్యాలు ఏ రకమైనవో గుర్తించండి )

| | |
|---|---|
| 1. ఆహా! తాజ్ మహల్ ఎంత అందంగా ఉంది.<br>ఆశ్చర్యార్థక వాక్యం | 16. వర్షాలు లేక పంటలు పండలేదు.<br>హేత్వర్థక వాక్యం |
| 2. ఈ రోజు మా స్కూలు బస్సు వస్తుందో రాదో?<br>సందేహార్థక వాక్యం | 17. సీత చదువుతుందో లేదో?<br>సందేహార్థక వాక్యం |
| 3. మీరు రావద్దు.<br>నిషేధార్థక వాక్యం | 18. మీకు శుభం కలగాలి.<br>ఆశీర్వాద్యర్థక వాక్యం |
| 4. దయచేసి నన్ను కాపాడు.<br>ప్రార్థనార్థక వాక్యం | 19. ఎవరా పుత్తడి బొమ్మ?<br>ప్రశ్నార్థక వాక్యం |
| 5. మీరు రావచ్చు.<br>అనుమత్యర్థక వాక్యం | 20. ఎంత బాగుందో!<br>ఆశ్చర్యార్థక వాక్యం |
| 6. వారందరికి ఏమైంది?<br>ప్రశ్నార్థక వాక్యం | 21. నువ్వు చదువు.<br>విధ్యర్థక వాక్యం |
| 7. నేను తప్పక వస్తాను.<br>నిశ్చయార్థక వాక్యం | 22. అల్లరి చేయవద్దు.<br>నిషేదార్థక వాక్యం |
| 8. ఆహా! ఎంత బాగుంది.<br>ఆశ్చర్యార్థక వాక్యం | 23. పరీక్షలు రాయవచ్చు.<br>అనుమత్యర్థక వాక్యం |
| 9. వారు వెళ్ళవచ్చా?<br>ప్రశ్నార్థక వాక్యం | 24. తనూ బొమ్మలు వేయగలడు.<br>సామర్థ్యార్థక వాక్యం |
| 10. సీత కలెక్టరైందా?<br>ప్రశ్నార్థక వాక్యం | 25. చేతులు కడుక్కో!<br>విధ్యర్థక వాక్యం |
| 11. మీరు తర్వాత తినవచ్చు.<br>అనుమత్యర్థక వాక్యం | 26. చాలాసేపు టీవీ చూడొద్దు<br>నిషేదార్థక వాక్యం |
| 12. అక్క చెప్పేది విను<br>ప్రార్థనాద్యర్థక వాక్యం | 27. ఏం!ఎప్పుడొచ్చావ్?<br>ప్రశ్నార్థక వాక్యం |
| 13. రసాభాస చేయకండి.<br>నిషేదార్థక వాక్యం | 28. మీరు బయటకు వెళ్ళవచ్చు<br>అనుమత్యర్థక వాక్యం |
| 14. నీవు ఇంటికి వెళ్ళవచ్చు.<br>అనుమత్యర్థక వాక్యం. | 29. మీరందరు బాగా చదవండి.<br>విధ్యర్థక వాక్యం |
| 15. దయచేసి సెలవు ఇవ్వండి.<br>ప్రార్థనాద్యర్థక వాక్యం. | 30. బయటకు వెళ్ళరాదు.<br>నిషేదార్థకం |

31. వాడు రేపు ఉదయం గుంటూరు వెళ్ళవచ్చు.

సందేహార్థకం

32. కిషన్ చదువుతాడో లేదో

సందేహార్థకం

33. నీవు పరీక్షలు రాయవచ్చు

అనుమత్యర్థక వాక్యం

34. నేను తప్పక మీ ఇంట్లో పెళ్ళికి వస్తాను

నిశ్చయార్థక వాక్యం

35. రసాభాస చేయకండి

నిషేదార్థక వాక్యం

36. మీరు బడికి వెళ్ళండి

విధ్యర్థక వాక్యం

37. నేను రేపు తప్పక హైదరాబాదు వస్తాను

నిశ్చయార్థక వాక్యం

38. ఆహా! ఎంత బాగుందో!

ఆశ్చర్యార్థకం

39. నీవు పరీక్షలు రాయగలవు

సామర్థ్యార్థకం

40. మీరు మంచి పని చేయించారు

ప్రేరణార్థకం

41. గోపాల్ చెట్టు ఎక్కగలడు.

సామర్థ్యార్థక వాక్యం

42. సీత కలెక్టర్ అయ్యిందా?

ప్రశ్నార్థక వాక్యం

43. నువ్వు నూరేళ్ళు వర్ధిల్లు

ఆశీర్వార్థక వాక్యం

44. మీరు ఆఫీసుకు తప్పక రావాలి

నిశ్చయార్థక వాక్యం

45. దయ చేసి పని వేంటనే పూర్తి చేయండి

ప్రార్థ నార్థకం

46. రేపు నీవు బడికి వస్తావో రావో

సందేహార్థక వాక్యం

47. నీరు లేక పంటలు పండలేదు

హేత్వర్థక వాక్యం

48. మీరు వెళ్ళ వచ్చు

అనుమత్యర్థక వాక్యం

49. నీవు ఇంటికి వెళ్ళవచ్చు

అనుమత్యర్థకం

50. ఎక్కడ నుంచి వస్తున్నావు ?

ప్రశ్నార్థకం

51. వానలో తడవొద్దు

నిషేదార్థకం

52. ఈ రోజు మీరు పాట పాడాలి

విధ్యర్థకం

53. అతడు ఇప్పుడు పాడలేడేమో

సందేహార్థక వాక్యం

54. నేను బడికి వెళ్ళను

వ్యతిరేకార్థక వాక్యం

55. దయ చేసి నా డబ్బు ఇవ్వు

ప్రార్థనార్థక వాక్యం

56. అందరికీ శుభం కలుగు గాక

ఆశీర్వాదర్థక వాక్యం.

# తెలుగు వ్యాకరణం



భాషాభాగములు–

1. నామవాచకము
2. సర్వనామము
3. క్రియ
4. విశేషణము
5. అవ్యయము

1. నామవాచకము – పేరును తెలిపే పదమును నామవాచకము అని అంటారు

ఉదా॥ – రాజు,రామారావు,ఆంధ్రప్రదేశ్

2. సర్వనామము – నామవాచకానికి బదులుగా వాడేదాన్ని సర్వనామము అని అంటారు

ఉదా॥ – అతడు,ఆమె,నేను,నువ్వు,వారు

3. క్రియ – చేసే పనిని తెలిపేదానిని క్రియ అంటారు.

ఉదా॥ – వచ్చెను,వెళ్లెను,వ్రాసెను

4. విశేషణము – గుణమును తెలియజేసేదానిని విశేషణము అంటారు.

ఉదా॥ – తీపి,చేదు,పులుపు,తెలుపు,మంచి,చెడు

5. అవ్యయము – లింగ వచన విభక్తులు లేని పదమును అవ్యయము అని అంటారు.

ఉదా॥ – ఓహో,ఆహా

ఏకవచనము – ఒక వ్యక్తిని లేదా వస్తువు గురించి తెలిపేదానిని ఏకవచనము అంటారు.

ఉదా॥ – కంప్యూటర్,పుస్తకము,పెన్ను

బహువచనము – ఇద్దరు లేదా అంతకంటే ఎక్కువ వస్తువులు లేదా వ్యక్తులు గురించి చెప్పేదానిని బహువచ అంటారు.

ఉదా॥ – కంప్యూటర్స్,పుస్తకాలు,పెన్నులు

పకృతి – మార్పుచెందని మూలపదము.దీనినే తత్సమము అని అంటారు.

ఉదా॥ – రాజు,లక్ష్మి

వికృతి – పకృతి పదమునుండి మార్పుచెంది వచ్చిన పదము.దీనినే తద్భవము అంటారు.

ఉదా॥ – రేడు,లచ్చి

కర్త – పనిచేయువానిని లేదా దానిని తెలిపేమాటను కర్త అంటారు.

ఉదా॥ – రవి ఊరు నుండి వచ్చాడు ఇక్కడ కర్త రవి

కర్మ – పనియొక్క ఫలమును పొందు దానిని కర్మ అంటారు.

ఉదా॥ – రాము బడికి వెళ్లెను ఇక్కడ కర్మ బడికి

క్రియ – చేసే పనిని క్రియ అంటారు.

ఉదా॥ – రాము బడికి వెళ్లెను ఇక్కడ వెళ్లెను అనేది క్రియ

క్రియా రూపంలో వచ్చే మార్పులను తెలియచేయు దానిని కాలము అంటారు.కాలమును 3 రకాలుగా విభజించవచ్చు.

1. వర్తమాన కాలము – ప్రస్తుతం జరిగే పని గూర్చి తెలియజేయుకాలమును వర్తకాలము అంటారు.
2. భూత కాలము – జరిగిపోయిన పనిని గురించి తెలిపేకాలమును భూతకాలము అంటారు.
3. భవిష్యత్ కాలము – భవిష్యత్‌లో జరగబోవు పనులను తెలిపేకాలమును భవిష్యత్‌కాలము అంటారు.




కవితాశిరోమణి, దైవజ్ఞులు

## రచయిత : శ్రీ పంతుల వెంకట రాధాకృష్ణ

సెల్ : 9966455872 9492245872

గ్రేడ్ 1 తెలుగు పండితులు, జి.ప.ఉ.పాఠశాల చిట్టివలస విశాఖజిల్లా

ముద్రిత పుస్తకములు : 1.బాలల రామాయణం 2.సుధారామము 3.అమ్మకు అక్షరాంజలి 4.బుక్షశీలాధ్యాయనం 5.పవిత్ర రత్నధారణ 6.దక్షిణామూర్తి కదంబం 7.పరాక్రివ్యాకరణం

భార్య : శ్రీమతి పంతుల జయ మహేశ్వరి

కుమారులు : పంతుల వెంకట లలితా శ్రీకర్

పంతుల వెంకట గౌరీ సుధీర్

**See My 4 Blogs :**

పరాక్రి జయ పదనిసలు http://jayaparakri.blogspot.in

తెలుగు పండితవర్శిని http://teluguteachers-parakri.blogspot.in,

సాధన ఆరాధన http://parakrijaya-parakri.blogspot.in/,

http://medhadakshinamurtyjyotishanilayam.blogspot.in,

Like FB page : https://www.facebook.com/SRIMEDHADAKSHINAMURTYJYOTISHANILAYAM

# శ్రీ మేధాదక్షిణామూర్తి జ్యోతిషనిలయం